# రోషనార

Roshanara

అను

## జహ్వేరీబాయి

Jahveree bhai

గ్రంధకర్త:


బద్దిరెడ్డి కోటేశ్వరరావు.

Bhaddi reddi Koteeswara Rao



పబ్లిషరు:

కురుకూరి సుబ్బారావు,

Kurukuri Subba Rao

బుక్ సెల్లరు.

భీమడోలు అండు బెజవాడ.

రెండవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

క. సుబ్బారాయసోదరులచే స్కేప్ అండు కో., లో ముద్రితము.

1929




[వెల **1—0—0**

# పాత్రల వివరము.



## పురుషులు.

శివాజీ—కథానాయకుఁడు

మోరోపంత్—శివాజీ ముఖ్యమంత్రి

| | |
|---|---|
| రామోజీ<br>నేతాజీ<br>తానాజీ<br>గంగాధరుఁడు | మహారాష్ట్రనాయకులు |

మోఅజీము—ఔరంగజేబుకుమారుఁడు

| | |
|---|---|
| విక్రమసింహుఁడు<br>రామసింహుఁడు<br>జయసింహుఁడు<br>మీర్ జుమ్లా | మొగల్ సేనాధిపతులు |

| | |
|---|---|
| రజాక్<br>దావూద్ | అడవిదొంగలు |

ద్వారపాలకులు మొదలగువారు వత్తురు.

## స్త్రీలు.

రోషనార—కథానాయిక

| | |
|---|---|
| దిల్ ఖుష్<br>హుషారి | వేశ్యలు |



శ్రీమత్పరదేవతాయైనమః

# రోషనార

అను

## జహ్వారీబాయి.



### ప్రథమాంకము.



ప్రదేశము—రాయగడమునందు రాజభవనము.

(శివాజీ, మోరోపంత్ ప్రవేశము)

—అమాత్యవరా!

గీ॥ కదనమునఁ గాయమెల్ల । రక్తంపుటేర్లు
పారుచుండిన ప్రేవులు । బైటబడిన
వెన్నుఁ జూపక మహారాష్ట్ర । వీరు లరులఁ
జెనకెదరటంచు నౌరంగ । జేబెఱుఁగఁడో?॥

ఱుఁగ కేమి? వాని హృదయగోళమున, మహారాష్ట్ర విజయసింహములు నాట్యమాడుచుండుట లేదా?

సీ. దుర్భేద్యమైనట్టి । "తోరణ" దుర్గమున్
నశియింపఁ జేసిన । నాశతఘ్ని

దుర్మార్గుఁడైన "య । బ్దుల్ ఖాను" శిరమును
తేకువఁగోసిన । నాఖరాసి
"అఫ్జులుఖా"ను గ । ర్వాలయముం జీల్చి
కూల్చిన, నాపులి । గోళ్ళపటిమ
"షైస్తఖాన్" సర్వసై । న్యార్ణవ మింకింపఁ
గలిగిననాడు కా । ల్బలముశక్తి
గీ॥ అమిత శౌర్యాగ్ని తేజుల । నైన, వ్రిక్క-
లించి, మించిన, నామావ । ళేలబలము
నెఱిఁగియుండియు నింతలో । మఱచిపోయి
మరల మహారాష్ట్రిలందాక ? వచ్చినాఁడె?॥

మోరో — మహారాజా ! ఔరంగజేబు ప్రవర్తన లోకమునకు గొత్త కాదుగదా ? అందినజుట్టు, నందకున్న గాళ్లుపట్టుకొనుట మన మెఱుంగమా ? వానిరాజనీతియంతయు తేనెబూసిన కత్తి యనుటకు సందియములేదు.

శివా — సత్యము సత్యము.

మోరో — రాజేంద్రా ! కొన్ని వందల సంవత్సరములనుండి విజయవిక్రమాటోపములచే మొగల్ సామ్రాజ్యము తేజోవంతమై రాణించుచుండఁగ, నేఁటికి యౌరంగజేబు కాలమున సంపూర్ణముగ నస్తమించునని తోఁచుచున్నది. కావున,

ఆ॥ వె॥ పశుసమానుఁడైన । శిశుపాలునింభంగి
విక్రమమునవిజ్జ ? వీగుచున్న
కఱకుతురక నింకఁ । గరుణింప, నగ్గిలో
నేయిఁబోసినట్లు । నెగడుఁగాదె ?

(అంత ద్వారపాలకుఁడు ప్రవేశము.)

ద్వార—మహారాజా! జయముజయము. ఎవరో రాజపుత్రుఁడు తమ దర్శనార్థమై హజారముకడ వేచి యుండెను. ఏమియాజ్ఞ?

శివా—సత్వరము లోనికిఁ బంపుము.

ద్వార—చిత్తము. (నిష్క్రమించును)

మోరో—నరేంద్రా! ఆ రాజపుత్రుఁడెవ్వఁడై యుండునో గదా?

శివా—అతఁడెవ్వఁడైనది నాకును స్ఫురించుటలేదు. రాజపుత్రులలో మనకాప్తు లంతగా లేరు.

రామసింగు—(ప్రవేశించి) మహాప్రభూ! అట్లనవలదు. రాజపుత్రుఁడనగు నేను మీకాప్తమిత్రుఁడనుకానా?

శివా—ఓహో! ఏమీ యాశ్చర్యము? రామసింహామహాశయా! స్వాగతము.

మోరో—దేవా! జోహారు.

శివా—ఆరోగ్యోత్తమా? మీదర్శన భాగ్యమున నేఁడెంతయు సుదినము.

అ॥ వె॥ కల్లలాడి, నన్ను । ఢిల్లీకి బిలిపించి
కటకు తురక జేఁడు । జెఱనుబెట్ట
మీకృపాకటాక్ష । వీక్షణమున గదా
బ్రతికి బైటఁబడితి । ప్రాణదాత !

మోరో—స్వకుల కులాభిమాన బద్ధకంకణులగుట, మీకివే సహస్రకృతజ్ఞతాపూర్వక వందనములు.

రామ—రాజేంద్రా! సచివాగ్రణీ! మహానుభావులగుమీస్తోత్రపాత్రముల కే నర్హుండనుకాను. కాని, నన్ను మరువకుండిన మీయుదారగుణంబుల కెంతయు సంతసింపుచున్నాను.

శివా—రాజా !—

రామ—దేవా! "రాజా" యని సంబోధించు టెవ్వరిని?

శివా—అట్లనెద రేల? మీరు జయపురసార్వభౌములు కారా?

రామ—నేను జయపురసార్వభౌముఁడనేగాని, స్వకులకులాభిమానశౌర్యధైర్యాదులం దధికారములేక, నెట్టులో కప్పములురాఁబట్టుకొనినంత మాత్రమున నేను రాజునగుదునా? ముష్కరతురుష్కాధముల హస్తగతమైన వీరకాంత నేనాఁడు సంరక్షింపఁగలుగుదునో? యానాఁడు కదా రాజనామము సార్థకమగుట.

శివా—ఏమీ! మీరాజ్యాదిభోగములు కూడ మ్లేచ్ఛులయాధీనమయ్యెనా?

మోరో—కథావిధాన మూహింప నట్లేయున్నది.

రామ—మహారాష్ట్ర వీరసింహా! నేనేమనివిన్నవింతును. నిష్కళంకమగు నాకులకన్యకలు తురుష్కాంతఃపురములఁ గోడండ్రుగా నున్నారు. నేనో, దేశద్రోహియగు యౌరంగజేబు కొలువున సేనానాయకుఁడనై, బిరుదులను జాగీరులను చేఁబట్టి యేఁటేట మూఁడులక్షల రూప్యములు కప్పముఁ గట్టుచు, బానిసనై యుండఁగ వేఱయుఁగవలయునా? ఇటినన్ను "రాజా" యని పిలుచుట మఱింత బాధాకరము గాదా?

మోరో—దేవా! రామసింహమహాశయుని యాత్మగౌరవాభిమానము లెంతయు ప్రశంసనీయములు సుమా?

రామ—కావున, రాజశబ్దము నాకు సార్థకముకాదు. అందుచేత, తనయాఁడువాండ్రను మహమ్మదీయుల కర్పింపక, రాజ్యపరిహద్దులనైనఁ దొక్కనీయక, స్వాతంత్ర్య రాజ్యస్థాపనగౌరవరక్షణార్థమై ప్రతిఘటించి, యౌరంగజేబుతోఁ బోరాడుచున్న శిశోదియావంశపా

భోధిచంద్రుఁడు—విమలాదేవి హృదయకమలామనోహరుఁడు—వీరకేసరిబిరుదాంకితరాజసింహుఁడే రాజు—లెక్కకొక్క హిందూరాజ యినఁదోఁడురాకుండినను, మిక్కిలి స్వల్పసైన్యంబుతోఁబోయి; యుగ్గుతోఁ ద్రావిన శౌర్యప్రతాపాదుల విజృంభింపఁజేసి, మొగలుల ననేక సారులు చీల్చి, చెండాడి, తన రాజ్యలక్ష్మిని గాపాడుకొనిన వీరవిక్రమ ఛత్రపాలుఁడే రాజు. గోల్కొండ, బీజపూరు రాజ్యము లొక వైపునను, ఔరంగజేబు సేనాప్రవాహమింకొక వైపునను, సిద్దీబలంబులు మఱియొక దిక్కునను, త్రివేణీసంగమస్థలమువోలె, నొక్కుమ్మడి నావరించినను, చెక్కుచెదరక, సకలశాత్రవానీకమును పటాపంచలు గావించి, మహారాష్ట్రరాజ్య మను వేఱొండు కీర్తికాంతను స్థాపించి, హిందూమతగౌరవపౌరుషాదులఁ జిరస్థాయిగ నిలువఁబెట్టిన యపరనారసింహావతారుఁడు, భారతమాతృగర్భపవిత్రరత్నాకరుఁడు, అట్టి శ్రీశివాజీ మహారాజే రాజు.

శివా—ఆర్యోత్తమా! అదంతయు భవానీయనుగ్రహము. మీ సరళహృదయాభిప్రాయములకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

రామ—దేవా! మహమ్మదీయులెల్లరు, మిమ్ములను కొండయెలుకని పలికిన పలుకుదురుగాక. తురకల యుద్రేకపూరితవాక్యములు మేము విశ్వసించితిమని తలంపవలదు. మీసహజ సత్యప్రవర్తన శౌర్యాదులు లోకమునకుఁ గ్రొత్తగాదుగదా?

మోరో—విజయవిక్రమసింహా! రామసింహా! ఔరంగజేబు మహారాజునకు గొండయెలుకని బిరుదొసంగుటకు తగిన కారణములేక పోలేదుసుమా!

సీ. యవనులంచనెడి, ధా । న్యపుకొట్టులంజొచ్చి
కరకర గింజలన్ । కొఱుకుచుంట
భారతీయులదాస్య । బంధవిముక్తికై
కరపాద సంకెలల్ । గఱచుచుంట

కొండఁబోలిన కోట । గోడకు క్రిందుగా
దారికై కన్నంబు । ద్రవ్వియుంట
భారత స్వారాజ్య । పతియాగణేశుని
భుజపీఠమునఁ బూని । మోసియుంట
గీ॥ కని, వినని చిత్రనాటక । కర్తయగుట
మాప్రభువు కొండయెలుకను । మాటనిజమె;
డిల్లపడనేల! తానొక । పిల్లియైన
సంగరంబున గుటుకున । మ్రింగరాదె?

రామ—ప్రధానామాత్యా! నిక్కము వచించితివి. దూరము నుండి చిట్టెలుకయని భ్రమించి, సమీపించిన తోడనే చిచ్చరపిడుగని భయంపడి, చెట్లకెగబ్రాకుచున్న, చిత్రమార్జాల మాయారంగజేబ నుటనిజము. ఈమాటలకేమిగాని ప్రస్తుతాంశమునకు వత్తము. ఓశివాజీచక్రవర్తీ! మోరోపంతుజీ! నేనిచటకు వచ్చిన కార్యక్రమము వినిపించెదను. అవధరింపుఁడు.

శివా—<br>మోరో— } విధేయులము.

రామ—హిందూబాలికలను మహమ్మదీయులకిచ్చి పెండ్లిసేయుటకై దారిజూపినది మద్వంశజుండగు బిహారీమల్లుఁడు ప్రధానపురుషుఁడు. తురుష్కులకొలువుఁ గొలుచుటకుగూడ నావంశజుఁడగుమానసింహుఁడే ప్రత్యక్షదైవము. కులమతాచార స్వాతంత్ర్యనిరోధమునకు సయితము నావంశమే మూలకారణము. ఈమహాఘోరపాపనివారణార్థమై దేశసేవయొనర్చి, దేశాభ్యుదయమునకు పాటుపడి, కళంకరహితముఁ గావించుకొనవలెనను తలంపుగలిగినది. (వారినిజూచి) అయ్యలారా! మీరట్లాశ్చర్యముఖావలోకనము కనఁబఱచెద రేల? హైందవుల మాన ధనాదుల నపహరించి, వేధించుచున్న, యారంగజేబు

సేనానాయకుఁడనగు నేను, దేశాభ్యుదయమునకై పాటుబడెదననుట హాస్యాస్పదమే యగును. కాని, వ్యర్థప్రయత్నము కాదు. ఇందులకు రెండేమార్గములు. ఒకటి కంటకశిలావృతమగు కాలిబాట. రెండవది రాజబాట.

శివా — అం దర్థమేమి ?

రామ — ఉద్యోగము వదలికొని దేశసేవఁ జేయుటొక మార్గము. ఉద్యోగమునందుండియే దేశసేవకై వర్తించుట రెండవమార్గము. ప్రస్తుతావస్థననుబట్టి రెండవమార్గమునే యధిష్ఠింప నిశ్చయించుకొంటిని. కారణమేమన, మీసఖ్యము నాకిప్పుడు రాజబాట. తత్కారణమున, నేను యథావిధిగ వానియొద్దనే కొలువుండి, తద్రహస్యములనెల్ల నెప్పటికప్పుడు మీకెఱిఁగించుచుండెదను. సునాయాసముగ వారుమీచే భంగమొందెడి రంగస్థలములకు నడిపించెదను. సమయమెఱిఁగినేను నా సేనాసమూహముతో మీపక్షమవలంబింతును. ఇందులకు మీరంగీకరించి, నన్నుఁ జేఁబట్టెదరని నమ్ముచున్నాను.

శివా — మహానుభావా! భారతమాతృదాస్యవిముక్తికై కలవరపడుచున్న మీసరళహృదయమున కెంతయు, సంతసింపుచున్నాను. ఇంక సంశయింపఁబనిలేదు. ఇదుగో! నేఁటినుండిమిమ్ము నాయాఱవప్రాణముగ నెంచుచున్నాను. (చేతిలో జేయివెచి) మీయభిప్రాయముతో నే నేకీభవించితిని.

రామ — ధరాధిపా! నే నెంతయ[redacted]న్యుండను. నామనోరథ మీడేరినది. నాకోరికలీరికలెత్తుచుండెను. కాని, రాజద్రోహమునకుఁ బూనికొంటినని మీయంతరాత్మ పీడించుటలేదా?

శివా — రామసింహమహాశయా! నాహృదంతరాళమున నెట్టి బాధయులేదు. ఇఁక ముందైననుఁ గలుగదు. ఆయాకారంగజేబు సంధిని

యములఁ బాటింపకపోయినను రణధర్మములకైన బద్ధుఁడుకాఁడు. వానివ్యూహము లన్నియు నబద్ధము. మోసము. ప్రజాపకారము. నీతి బాహ్యము. కావున, కత్తిగట్టి వానిని సాధించుట దుస్తరము. సామమునఁ గష్టతరము. దానముచేఁ గష్టతమము. భేదోపాయములచేతనే మనకు సులభసాధ్యము. దిగ్విజయము. మన మొనర్చునది రణధర్మము గాకపోయినను, వాఁడనవరతము హిఁదూపప్రజాద్రోహి. అట్టిద్రోహి కిఁబ్రతిద్రోహమే సమంజసము.

మోరో—దేవా! వాస్తవమే. కాని, మనము హిందువులము. హిందూధర్మశాస్త్రము లలక్ష్యముజేసి, క్షాత్రధర్మములు విడనాడి, ద్రోహమున కొడిఁగట్టుట పాడియా?

శివా—సచివోత్తమా! సమయంబరసి సాహసింపక నూరకుండుటచేతనే, మనపూర్వులు భారతమాతృభూమి కెన్నరాని బానిసవృత్తి నొసంగియున్నారు చూడు!

సీ॥ ఘోరాజిఁ జిక్కిన । ఘోరీమహమ్మదుఁ
పృథ్వీరాజేంద్రుఁడు । పొడిచియున్న
రాణీసంయుక్తని । ర్దయఁబూని జనకుఁడౌ
జయచంద్రునిం బట్టి । చంపియున్న
పద్మినీముఖము ద । ర్పణమందుఁజూడ వ
చ్చిన, పాదుషనుబట్టి । చీల్చియున్న
సంగరంబందు నౌ । రంగజేబును బట్టి
రాజసింహుఁడు కాల । రాచియున్న
గీ॥ వాడవాడలవారి క । కాలమరణ
మేలఁగలుగు? నంతఃపుర । స్త్రీలకెటుల
జెఱఁగలుగు? భారతీయుల । స్వీయధర్మ
పాలనంబున కడ్డంకు । లేల గలుగు?

నెన్నఁడీ సంధి హైందవు ! లెఱిఁగియుండి
రణ మొనర్తురో ? నాఁడె స్వ । రాజ్య మొదవు॥

రామ—పురుషసింహా ! యథార్థము వెల్లడించితిరి. కాని, హిందువులు రణధర్మబద్ధులగుట చేతనే, చేఁజిక్కిన తురుష్కాధిపతులు సజీవనులై, చిట్టచివరకు వారొనర్చిన ఘాతుకకృత్యములఁ దలంప గుండె లవియుచుండెనుగదా ?

సీ॥ రణతలంబునఁ బృథ్వి । రాజేంద్రునిం బట్టి
"ఘోరీ" కిరాతుఁడు । గ్రుడ్లుదీసె
అల "ముబారికుఁడు", నా । హరిపాలదేవుని
నిలఁబెట్టి చర్మము । నొలిచి చంపె
నల, "నిజాంషాహా ఖా ! నుఁడు" రామరాజు శి
రము ద్రుంచి, మేటి బ । ల్లెమున గ్రుచ్చె
"బహిరాము ఖానుఁడు" । పగదీరఁగా "హిమూ"
కాంతునిశిరముఁ జె । క్కులుగ దరిగె
గీ॥ హైందవులనిట్లు చిందర । వందరగను
జీవములఁదీసి రాజ్యముల్ । జేర్చెగాని
పాడికాదని మనలఁ బో । నాడినారె ?
తురకసరదార్లమని కత్తి । దూయుచుండె॥

మోరో—ఆమాట నిక్కువమేగాని, మనకిప్పుడు కర్తవ్యమేమి ?

శివా—రామసింహ మహాశయా ? మాటలతో కాలయాపన మేల ? మీరీవిషయమున మాకు జేదోడు వాదోడుగా నుండవలయును.

రామ—రాజా ! శత్రుసాధనకై దండోపాయ మిప్పు డనవసరమని తోచుచున్నది.

శివా—అంతమాత్రమున వశీకృతుఁడగునా ?

రామ—తప్పక వశ్యుఁడగును.

శివా—అటులయిన వినగోరుచున్నాను.

రామ—సింహగడసామీప్యమందున్న ఔరంగాబాదు మొగలులకు ముఖ్యస్థానము. అక్కడ విడిసియున్న సమస్త సేనలకు నౌరంగజేబు పుత్రుఁడగు మోఅజీము ముఖ్యసేనాధిపతిగను, జోధపురేంద్రుఁడగు యశోవంత సింహుఁడును, సేనను, సహాయసేనానాయకులముగను విభజింపఁ బడియుంటిమని మీరెఱింగియే యుందురు కదా ?

శివా— / మోరో— } వినియున్నాము. తరువాత?

రామ—మోఅజీము రణసింహుఁడేగాని, విషయలంపటుఁడు. కష్టబారుఁడు. మిక్కిలి తాగుఁబోతు. ఇఁకయశోవంతసింహుఁడవగా నమితధనాపేక్షఁగలవాఁడు. కావున, గడియలో కన్నులకు గంతలు గట్టి, గంగిరెద్దువలె వాండ్రిద్దర నాడింపవచ్చును.

శివా—అవును. కార్యసాధనమున కనువైనమార్గములే.

రామ—కాని, వశీకరణశక్తిని మీరె సృజించి పంపించవలెను.

మోరో—మామహారాజుగారి కుపాయముల కేమికొదువ?

శివా—(ఆకస ముపేక్షించి) ఆర్యా ! చెప్పెదవినుము. మీరు తత్క్షణముబోయి మాసైన్యములో కలిసికొనుఁడు. నేను, నేఁటికైదవ రోజున మోఅజీమునకు మూఁడులక్షలును, యశోవంతసింహునకొక లక్ష రూప్యములును, వజ్రవైడూర్య మాణిక్యహారాదులును పంపుచు మీకొరనొకజాబుగూడ పంపించెదను. అవన్నియు వారికందజేయుఁడు ?

రామ—చిత్తము.

శివా—కోపావేశమున బహుమతులు నిరాకరించిరేని, యేవిధినైనఁ బ్రోత్సహించి, యిరువదిదినములవఱకు యుద్ధమునకు, బయలుదేరకుండు నట్లొనర్పవలయును. అటులొనర్పఁగలరా?

రామ—అంతమాత్రము చేయఁగలనని దృఢనిశ్చయము.

శివా—అటులయిన, నే నీ గడువులోపల ఘనకార్యమొకటి చేయవలసియున్నది. సింహగడము మొగలుల స్వాధీనమందుండు కతన, చాకణ్ దుర్గము మీఁదుగ పూనాకువచ్చుట మిక్కిలి కష్టముగా నున్నది. ఈసింహగడము మహారాష్ట్రుల హృదయపర్వతము. ఇయ్యది పూనా, రాయగడ్, చాకణ్, పురందర్ దుర్గములకంటె నెత్తుగా నున్నది. తత్కారణమున మాకు దుర్భేద్యముగ నున్నది. అందుచేత ముందుగా దీనిని సాధింప నిశ్చయించితిని.

రామ—దేవా! అట్లేకానిండు. నేనేగి వారిని జోకొట్టుచుండెదను. గడువులోపల నాయభీష్టముఁ దీర్పవలయును.

శివా—అట్లే యొనర్చెదను.

రామ—నాకింక సెలవొసంగెదరా?

శివా—చిత్తము, పోయిరండు.

రామ—అమాత్యవరా? సెలవు.

మోరో—చిత్తము.

రామ— (నిష్క్రమము)

(ద్వారపాలకుఁడు ప్రవేశము)

ద్వార—మహారాజా! జయము. తమ దర్శనార్థమై తానాజీ మాలశూరేగారు వచ్చియున్నారు.

శివా—తోడ్కొనిరమ్ము.

ద్వార—చిత్తము. (నిష్క్రమించును.)

(తానాజీమాలసురే ప్రవేశము)

తానా—మహారాజా? అభివందనములు. సచివోత్తమా! నమస్కారములు.

శివా—హితోత్తమా! మీరు వచ్చినకారణమేమి?

తానా—రాజేంద్రా! మనరాయగడమునకు గొన్నికోసుల దూరముగ స్వర్ణడోలికయొకటి పోవుచున్నది. దానిచుట్టు నలుబది మందితురకలు నడుచుచున్నారు. చూడఁగా, మోఅజీము పల్లకివలెఁ గాన్పించుచున్నది. అందాతఁడే యుండవచ్చును. కావున పల్లకి నిటకు బట్టుకొని రమ్మనెదరా?

శివా—(యోచనజేసి) సచివాగ్రణీ? పల్లకియందు మోఅజీమేయుండుట తటస్థించెనేని, కాయకష్టములేకయే, యతారంగజేబు నేడాటలాడింపవచ్చును. ఓ సేనానాయకాగ్రణీ! తానాజీ! సత్వరముమీరే గిదానినిబట్టుకొని, రహస్యముగ నాశయనాగారమును జేర్చి నాకు తెలియజేయుఁడు?

తానా—చిత్తము.

శివా—మఱియొకమాట. పల్లకీయందున్నవారి కెట్టిహానియు నొనర్పగూడదుసుమా? మఱియు నందున్నవ్యక్తి యెవ్వరాయని ప్రయత్నింపవలదు. ఆపల్లకియందొకవేళ స్త్రీయార్తనాదము వినఁబడెనేని యామెను గన్నెత్తియైనఁ జూడక పల్లకిని విడిచివేయునటులభటుల కాజ్ఞనొసంగుఁడు.

తానా—చిత్తము.

శివా—ఇంకమీరరుగవచ్చును.

తానా—చిత్తము. మంత్రివరా! సెలవు.

(నిష్క్రమించును.)

మోరో—రాజేంద్రా! సింహగడసాధనోపాయమున కేమి యాజ్ఞ?

శివా—రసపుత్రవీరుఁడైన యుదయసింహుఁడు సింహగడరక్షకుఁడు. మనతానాజీ వానికన్నివిధముల నీడగువాఁడు. కావున నేనిమిదివందల మానవశేలతో సింహగడసాధనకై తానాజీని బంపించవలయును.

మోరో—అట్లే యొనర్చెదను. కాని, భేదోపాయముకంటె దండోపాయమునకు సిద్ధపడకూడదా?

శివా—మంత్రీ! ఆసాధనమిప్పట్లుపనికిరాదు. ఏమంటివేని?

గీ॥ ఈమహారాష్ట్రరాజ్యశ్రీ । వృద్ధికొఱకు
రక్తనదులయిపాఱె మ । రాటిదండు;
మరల నారక్తపాతము । నరయనేల?
భేదనోపాయమంతకు । వృద్ధి తలప.

ఇదియునుఁగాక, రణమన నేమిగా దలంచితిరి?

సీ॥ భారతజీవనో । పాధియౌ పచ్చని
పంటలనార్ప ని । ప్పంటిరవ్వ
రక్తమాంసాదు లా । సక్తికై పోరాడు
నాడు ఘూకములకు । పాడిపంట
రోయఁగా, హేయమౌ । రుజులఁ బ్రసాదించు
మారీగ్రహముల సం । బరపుగోల
బాలబాలికల యూ । వనుల వృద్ధాప్యుల
హాహారవంబుల । కాటపట్టు

గీ॥ దార్లుగొట్టెడివారికి । తస్కరులకు
నమితదోపిడిగాండ్రకు । హంతకులకు

జారులకు కల్పవృక్షమై । సత్కరించు
రణతలంబెన్న సర్వ మా । రణమునుమ్ము॥

ఇప్పటికి రెండుమూఁడేండ్లనుండియు యుద్ధములులేక ప్రజలుసుఖపడు చున్నారు. అట్టి ప్రజారంజకమునకు క్లేశములు కలిగించుటకు నామన సొప్పకున్నది.

మోరో—చిత్తము. మీయాన కడుగు దాఁటుదుమా ?

శివా—మఱియొకమాట. నేఁజెప్పినదొప్పున కార్యక్రమము నడిపించుచు, చాలతా బాదుసంగల చక్కని తురక వేశ్యలను రప్పించి వాండ్రను మోఅజీముకు కాన్కగాఁ బంపించుము. శత్రుసాధనమున కదియే మనకు ముందుత్రోవ. నేనిఁక నుద్యానవనమున కేగవల యును.

మోరో—చిత్తము. సెలవా సంగుడు?

శివా—పోయిరండు.

(ఇరువురు నిష్క్రమింతురు.)





# రోషనార.



## ద్వితీయాంకము.



ప్రదేశము—శివాజీశయ్యాగృహము.

(పల్లకిలోనుండి రోషనార ప్రవేశము.)

రోష—(గది నలువైపులఁదిలకించి) ఈపురమె రాయగడము. చూడఁజూడ నిదియొకశయనమందిరమని, గోడలకు వ్రేలాడఁగట్టఁబడియున్న పటములె చెప్పుచున్నవి. కాని, యీమందిర మెవ్వనిదో గ్రహింపవలెను. (పటములఁబరీక్షించి) ఆహా? నేఁడెంతసుదినము! ఇదియె శివాజీఛాయాపటము. నామనోరథమీడేరినది. ఇదియె శివాజీశయనాగారము? (మరల పటమునుజూచి) ఆహా! ఏమీ యపూర్వవేషధారణము. కాదుకాదు. ఇదంతయుసహజసౌందర్యమే. ఈరసికాగ్రగణ్యుని మున్ను చూడజాలకపోయినను, వానిచిత్రపటమైనఁజూచుటకు నేఁటికి తటస్థించెనుగదా? (మరలదిలకించి) ఓమహారాష్ట్ర సార్వభౌమా? పురుషసింహా! నేనెవ్వతెనో యెఱుంగుదువా? మహమ్మదీయవంశసంజాతను. రోషనారను. ఢిల్లీశ్వరుండగు యౌరంగజేబు సోదరిని. నన్నునీవెన్నడు గనివినియెఱుంగవు. అదియునుఁగాక, నిన్ను నేనొకప్పుడుచూచియుండినసంగతినైననెఱుంగవు. మాయనుమతిని నీవు ఢిల్లీకరుదెంచి రాజమందిరమును ప్రవేశించినప్పుడాప్రక్క మందిరము

తలుపుచాటునుండి, యేకాంత—యేతరళనయన-యేమందగమన— యేచంద్రవదన- యేమన్మధవికారసంచలిత హృదయ! నీసుందరాకార ముపై- వాలుఁజూపులు ప్రసరింపఁజేసెనో కనుఁగొంటివా? లేదులేదు. నాఁటికే గ్రంటిచూపులతోఁబాటు, నామానసచకోరము యెగిరివచ్చి నీపైవ్రాలినదియైన నెఱుంగవుకాఁబోలు! ఓసుకుమారా!నాఁటినుండి నేఁటివఱకు నీ యభాగ్యురాలు, నీపై మరులుదగిలి, మోహాభరముచేఁ దరిలేనిచింతాసముద్రమధ్యమునమునిఁగియున్నది. కాని,కొంతకాలము విఫలమనోరథనయ్యు, నాయనురాగమేజయస్తంభమై, నామానసవీధి నధిష్ఠించి పాలింపుచున్నది. కాని, లాభమేమి?ఎన్నఁడైన, నెంతటివారి నైన, నెట్టిసుకుమారశరీరునైనఁగాంచి,యుబ్బితబ్బిబ్బు జెందని,యీమా నసము యీశిలానిర్మితహృదయ ఫలకము-నీ సుందరవిగ్రహసందర్శన మున,నమందానందకందళితహృదయారవిందనై- ప్రాణపంచకము నీ యధీనంబుఁ గావించితిని. ప్రాణేశ్వరా! అనురాగపాశము నన్ను బం ధించి వేధించుచున్నది. నీకరస్పర్శనమునగాని, పటాపంచలై మన శ్శాంతి గలుగదు. నేనింక మోహపిశాచమును భరింపఁజాల. భరింపఁ జాల. అబ్బా? సమయముగల్గినప్పుడైన నీముఖచంద్రమండలమును ముద్దిడుకొనక నూరకుందునా?ఇదియే నా మొదటిముద్దు గ్రహింపుము. (పటమును) ముద్దుబెట్టుకొని) ఓమానినీచిత్తచోరా !

సీ॥ మోహనాకార ! నీ । ముఖచంద్రమండల
మీక్షించి తొలుదొల్త । నిడినముద్దు
అప్రయత్నముగ న । న్నాకర్షణముజేయు
వెలలేని నీప్రజ్ఞ ! కిడినముద్దు
మొదటి వాల్జూపుల । నెదనాటి మితిలేని
వలపుగల్గించు నీ । కిడినముద్దు

అది మొదల్ రేబవ । లధిక మోహముచేత
సలయించుచున్న నీ । కడినముద్దు
గీ॥ ప్రియతమంబైన నాముర । పెంపుముద్దు
మరలనాకిచ్చి యిప్పుడీ ? ర్వంగలేవ ?
అంగనామణిచిత్తంబు । దొంగిలించి
కరుణఁ జేఁబట్టుకుండుట । ఘనత యగునె ?॥

(చప్పుడాలించి) ఏదోచప్పుడగుచున్నది. (పటమునెప్పటిచోటఁ బెట్టి తిరిగిచూచి) ఓహోహో ? నాయదృష్ట మేమనవచ్చును ? నామానస చకోరచంద్రుఁడు. నామనోహరుఁడు యిటువచ్చుచున్నాఁడు. నేనిట నిల్వరాదు. పల్లకిలోఁ బ్రవేశించెదఁగాక. (పల్లకిలో గూర్చుండును.)

(శివాజీ ప్రవేశము.)

శివా—(పల్లకిని బరీక్షించి) ఇదియే మోఅజీముపల్లకి. సంది యములేదు. ఇందు మోఅజీమే యుండవచ్చును. పోయిపలుకరించెదఁ గాక. (సమీపించి) స్వర్ణడోలికయందున్న యోవ్యక్తీ ! నేను మహా రాష్ట్రదేశాధిపతిని. శివాజీని. నీవు మోఅజీమువగుటచే, నీతోఁగొన్ని రాచకీయవిషయములు ముచ్చటింపఁదలఁచి, యీవిధముగ నిన్నుఁబట్టి తెప్పించితిని. నీకపకారము సేయుతలంపు నాకు లేదు. మహారాష్ట్రవంశ జుఁడెవ్వఁడైన నీయీగడ గ్రహించెనేని, నిన్ను ప్రాణములతోఁ బో వనిచ్చుటబద్ధము. తత్కారణమున నోరులు నిన్నెఱుఁగకుండ నాశయ నమందిరమునకు జేర్పించితిని. నాహృదయస్థితి నిప్పటికైన నెఱింగితివి గదా? కావున, సంశయింపక నిర్భయముగ వెడలిరమ్ము.

(రోషనార పల్లకియందుండి వెలువడును.

శివా—(నిర్విణ్ణుఁడగును.)

రోష—ఓమహారాష్ట్రరాజ్యస్థాపకా? అబలనగు నన్ను జెఱఁ

బట్టి, మీశయ్యాగృహంబునకుఁ గొనితెచ్చుట హిందూరాజులకుఁ దగునా ?

శివా—(స్వగతము) అక్కటా! ఇదేమిగ్రహచారము? నే నెంత పొరబడితిని? (ప్రకాశముగ) నారీశిరోమణీ! మీరెవ్వరు ?

రోష—ఆడువారమగుట తెలియుటలేదా ?

శివా—ఔను. కాని,

రోష—కాని యని, సందేహార్థ మేల ? మోఅజీమను నెపంబున, నాడుదానిని తెఱఁబట్టితిరని నేనే చెప్పియుంటినిగదా ?

శివా—(తనలో) దైవమా! ఈపెవాక్పూలములు నాహృదయపుటంబును పరిక్షాలించుచుండెఁగదా! (ప్రకాశముగ) తమనామధేయమడుగవచ్చునా ?

రోష—తప్పేమున్నది ? నాపేరు రోషనార.

శివా—ఆ! ఏమీ! మొగల్‌వంశపాథోధిగర్భరత్న - వివిధభాషాసారసంగ్రహధురీణ-కవయిత్రి-ఔరంగజేబు సోదరి.సమస్తరాజకీయానుభవధీశాలి-భయంకరాహవ శాత్రవవ్యూహభేదనీతివిశారద-పరిపంథిరాడ్గర్వనిర్భేదకుఠారి- నిరంతరవీరవిహారి- అగు రోషనారానారీతిలకముమీరేనా? ఆహా! అట్టి మీసందర్శనమగుట నేఁ డెంతయు సుదినము. కాని, మీరు ఢిల్లీనుండి యీప్రాంతములకు వచ్చినకారణమేమి ?

రోష—కొన్ని రాజకీయ వ్యవహారములమీద, మోఅజీము వద్దకు పాదుషాపంపగ వచ్చియుంటిని.

శివా—తెలిసినది. పల్లకీమోఅజీముదగుటచేనాతఁడేయిందుండెనని, పట్టుకొంటిమి. కాని, మీరొకపనిచేసియుండిన నింతదూరము రానవసరములేకపోవును.

రోష—అదెట్టిది ?

శివా—నాభటులు పల్లకిని బంధించినప్పుడు "నే నాఁడుదానను నన్ను విడువు"డని రెండుమాటలే చెప్పియుండిన, మిమ్ము విడిచిపెట్టుటే గాక, కోరినసాహాయ్యముగూడ చేసియుందురు. మీకీశ్రమయే లేకపోవును. నాయాజ్ఞలేనిదే స్త్రీలను జెఱబట్టరాదని మహారాష్ట్రదేశీయులకెల్లరకు నాయాజ్ఞ. అది మీకెఱుంగరు కాఁబోలు.

రోష—ఎఱుఁగుదును. (తనలో) నామనోగతము వెలిబుచ్చుటకిదియె మంచితరుణము. (ప్రకాశముగ) రాజేంద్రా! ఏయుద్దేశముతో ఢిల్లీనుండి, నేనీమహారాష్ట్రదేశమునకువచ్చియుంటినో-యాయుద్దేశము నెఱవేర్చుకొనఁదలఁచి-నే నాఁడుదానని మీభటులకు జెప్పనైతిని.

శివా—అందర్థమేమో నాకు బోధపడలేదు.

రోష—ఈపాటియర్థమును గ్రహింపలేకుందురా? పోనిమ్ము. నేనే జెప్పెదనువినుము. ఇంతదూరమువచ్చియు, నీరాజగడమునుజూచి పోవుదమనుతలంపుతో నటుల జేయకుంటిని.

శివా—ఓహో! మారాయగడముపై నింతటియనుగ్రహము మీకెట్లుగలిగినది ?

రోష—ఏలననగా, నాప్రాణసమానమగు వస్తువీరాయగడము నందుండుటచేతను; మీయనుగ్రహముపడయుటకును వచ్చియుంటిని.

శివా—ఆవస్తువెట్టిది?

రోష—చెప్పవచ్చునా?

శివా—మీకిష్టమైనచో.

రోష—మంచిది. ముందీప్రశ్నకు మాత్రము జవాబొసంగుము? స్త్రీలకు ప్రియమగువస్తువెద్ది?

శివా—ఎటువంటిస్త్రీలకు ?

రోష—వీరకాంతలకు.

శివా—క్షాత్రధర్మాధికారము.

రోష—అదియునుఁగాక ?

శివా—ఆభరణాదులు.

రోష—రాజేంద్రా! నీవువచించినదానియందొక్కటియుకాదు. నేఁజెప్పెదవినుము. స్త్రీకి-అనగా-నావంటికన్యకు-నవరూపలావణ్య రాశికి-వినుచుంటివా ? నీవంటిసుకుమారుఁడే ప్రియమగు వస్తువు. తెలిసినదా ?

శివా—(స్వగితము) అక్కటా! ఇప్పటికీమె యభిప్రాయము తెల్లమైనది. కాని, యీకోరికనిష్ప్రయోజనమని తెలిసిన పిమ్మట నెంతగాఁజింతించునోయని విచారమగుచున్నదిగదా ! (ప్రకాశముగ) ఓయమ్మా!

రోష—అమ్మా! యనెదవేల? కొమ్మా! యనిపిలువరాదా?

శివా—అదినాచేతగాదు.

రోష—పోనిమ్ము. ప్రియాయని—ప్రాణేశ్వరీ యని—సఖీ యని—పిలిచినఁజాలును.

శివా—శివశివా! పాపము శమించుఁగాక.

రోష—హృదయేశ్వరా! పరులు చూచెదరనిభయపడవలదు. రహస్యముగ వర్తించెదము.

శివా—కన్యారత్నమా!

గీ॥ మ్లేచ్ఛవంశంబునందు నా । విర్భవించి
రాణివై నన్ను గోరుట । రాజసంబె?
ఖలుకుమని యెను, మనసు మేర । వడఁకసాగ
కూలికి విషంబుద్రావెడి । వాఁడుగలఁడె? ॥

రోష—రాజా! నీవెంతయు పొరబడుచుంటివి. పరకాంతనై

నగదా పాపము. నేనిప్పుడుకన్యను. అదియునుంగాక; నీవుజోడువాండ్ర మగుటచే నొకరినొకరము ప్రేమించుకొనుట తప్పుగాదు. పరలోకవిషయమునకును సరలోకవిషయమునకు చాలా వ్యత్యాసములేదు. ఇదియునుంగాక; మనయనురాగమే పాపమంటివేని, దైవమున స్త్రీపురుష సృష్టియేల ? కన్యనగుట త్రికరణశుద్ధిగ వరించితిని. దానపాపంబులేదు.

శివా—కాంతామణీ ! సకలవిద్యావిశారదలగు మిమ్ముబోటివారె భేదభావముల బాటింపకున్న, మానవకోటి యధోగతి పాలుగావలసిన దేసుమా!

రోష—ప్రాణపతీ! లేనిపోనిగాథల గల్పించి పాపమని నిరూపింపకుము. కన్యలగుస్త్రీలకు స్వాతంత్ర్యధర్మ మొప్పుచున్నది. కన్యలువరించి వచ్చినప్పుడు పురుషుండగువాండు తప్పక జేబట్టవచ్చునని న్యాయశాస్త్ర మొప్పుచున్నది. కావున నన్నాయాసంబెట్టక లతానికుంజములచెంత కేగుదమురమ్ము.

శివా—అబలా! నాచిత్తమిప్పటికే చలించిపోయినది. కుదురుబాటు జనించుటకల్ల. మీరు ప్రత్యక్షమైన యుత్తరక్షణమున నేనువెడలిపోయిన నేమియు లేకపోవును. అదియునుంగాక; ఇరువురుభార్యలతో గృహస్థాశ్రమమున నున్నవాండను. నాయంతవారగు కొడుకుల నిర్వురను బడసితిని. వయసుచెల్లినవాండను. మఱియు, గోబ్రాహ్మణశిశుసంరక్షణమందును— పరాంగనాపహరణదండన మందును హిందూమతాచార దేశోద్ధారణమందును— వీరధర్మకంకణమును గట్టుకొంటిని. అట్టినన్ను బాధింపక ననుగ్రహింపుము.

రోష—మనోహరా! నాయనురాగలతను కరుణావిదూరులై ఖండించుట న్యాయమా? ఎంతదూరమునుండి యెంతదూరము వచ్చితిని? నీవే నాప్రాణధనంబని కొండంత యాశతో నంతఃపురము వీడి

వచ్చితిని. నాసనోరథ మీాడేర్చెదవని సాహసించివచ్చితిని. ఇదియుఁ గాక.

గీ॥ మదన సామ్రాజ్యభోగపు । మమతచేత
బడలి, నాచనుకొండల । భాగమందు
నీవుతలవాల్చి, నిదురింప । నేర్తువనుచుఁ
దలఁచివచ్చితి నన్నేలు । తాళఁజాల.

శివా—నారీతిలకమా! అన్యపురుషసంగము లేకఁ గట్టిపెట్టుము. నేను నిన్ను సోదరీమణిగ భావించితిని. నీవునన్ను సోదరేతరభావంబుతో బలుకుట పాడికాదు. పాదుషాయంతటివానికిఁ జెల్లెలివై, మహారాణీపదవికర్హురాలవై—వీరకాంతాశిరోమణివై—యన్యమతస్థుని ట్లువరించుటెంతటి నీచకార్యమో కొంచెము యోజించుము. మహమ్మదీయరాజ్యము లనేకములుగలవు. ఏసుల్తానునోవరించి, స్వకులకీర్తిచంద్రికలు వెలయింపవలెగాని, పరమతస్థుఁడనెగాక, నీసోదరునకు గర్భశత్రువునగు నన్ను వరించుట, మీావంగడమున కెంతేయుఁ దలవంపులు సుమా! నాహితవాలించి గమ్యస్థలము జేరుము.

రోష—ప్రాణకాంతా! నీపలుకొక్కటియు నాశ్రవణములసోకుట లేదు. ఏమందువా? ఆవైపుఁ దిలకించుము.

గీ॥ అల్లదే! కనుగొనుమ వృ । క్షాగ్రమందు
చిగురుటాకులు నములుచు । చెలిమిమీార
వేడుకలరఁగ బలుకుచు । పికములెటుల
మనలఁ జీరుచునుండె ర । మ్మా! యటంచు.

కోకిలల సంగీతమైన నాలకింతము రమ్ము.

శివా—ఏమిా! కోకిలారవములా?

గీ॥ వైరికోతలచేత మా । భరతమాత
పొగిలి దుఃఖించుచుండెడి । వగపు మిగుల

రాగరూపకముగ మారు । మోగుచుండ
చిలుకపల్కులు చెవులకు । జేరుటెట్లు ?

రోష—అయ్యో! నాథా! నాపై నీకింకను దయరాదుగదా ? అక్కటా !

గీ॥ గండకత్తెరఁ గుత్తుకఁ । గట్టియున్న
విలయకాలాగ్ని పిడుగు నీ । మీఁదఁబడిన
నించుకేనియుగాని చ । లింపవీవు
శిలయొ? వజ్రమొ? నీమేను । చెప్పరాదు.

శివా—నిజము నిజము. నామానసము పాషాణసదృశము. కావున, నింకనైన మీయభిలాష వీడెదరుగాక.

రోష—ప్రాణనాథా! నీవాడు మాటలన్నియు నిక్కవమేనా?

శివా—ముమ్మాటికి.

రోష—నాదీనాలాపము లాలకింపవా ?

శివా—నేవినఁజాలను.

రోష—ఓసుకుమారశరీరా! ఇంత మొండితనమా? సిరిరా మోకాలొడ్డఁదగునా? అబలనయ్యుసాహసించి వచ్చితినని యాకినుకఁ బూనితివి? అందులకొక మహత్తరమైన కారణము లేకపోలేదుసుమా? ఏమంటివేని ?

సీ॥ మృదులశయ్యాతలం । బుననేను నిద్రింప
నరుదెంచి నీవు ము । ద్దాడినావు
పొందుగా నీకంఠ । మందున్న మందార
పుష్పముల్ నాజడ । ముడిచినావు
జగదుపకార ప్ర । శస్తమౌ నీచేయి
విడనని నాచేతఁ । బెట్టినావు

చెవిలోన నొకమాట । జెప్పెదననుచును
బిగియారకౌఁగిలి । బెనఁగినావు
గీ॥ పుట్టతేనెనీదు । మోవిసారంబని
చుంబనంబొనర్చి । సొగసుగాను
రతివినోదములను । యతులితానందము
నొసఁగి, యిపుడునన్ను । కసరెదేల ?

శివా—(భయాశ్చర్యములతో) ఓకాంతామణీ! ఏమంటివి ? నేను నీగృహమున కరుదెంచి, నిన్నువరించి వినోదములఁ బొద్దుఁబుచ్చితినా? ఏల ననృతములాడెదవు ? ఈపాపాత్ముఁడే యట్టి ఘాతుక కార్యమొనర్చెనా?

రోష—నీవే స్వయముగ వచ్చి నన్నాలింగనముఁ జేసికొనిన, నాకేచింతయు లేకపోవునుగదా ?

శివా—అటులయిన ననత్యకల్పన రచించితివా ?

రోష—నేఁజెప్పిన దనృతము కాదు గాని, నిజమగు స్వప్నవృత్తాంతము.

శివా—అబ్బా! ఎగసిపోయిన నాల్గుప్రాణములు మరల బొందిలో నిప్పటికి జేరినవి. రోషనారా! మీరు నిజము వచించితిరి. లేకున్న నిందారోపణనివారణార్థమై, యీఖడ్గము నావక్షస్థల మలంకరించి యుండును సుమా !

రోష—ఇంకను కలవరపడనేల? కనుమూసినఁ జాలును. నీదివ్యమంగళవిగ్రహ సాక్షాత్కారము, అనుపమానందభోగము, ఆనందసామ్రాజ్యపాలనము. కనులఁదెఱచితినా ? గంపెడు దుఃఖము. వేదనాభరము సహింపఁజాలకున్నాను. అల్లిబిల్లిగనల్లుకొనియున్న యాపుష్పోద్యానమునకు బోయి విశ్రమింతము రమ్ము.

శివా___రోషనారా? ఇంతకాలము మీతో ప్రసంగించుట నాదే బుద్ధిలోపము. ఇఁక నాకడపటివాక్యము లాలింపుము.

గీ॥ ఆకసము, భూమి, కిరిందు మీ । దైనఁగాని
యినుఁడు చంద్రుఁడు గతులు ద । ప్పిననుఁగాని
ఆలుబిడ్డలు నాశన । మైనగాని
పడతి ! నీపొందు నొల్ల దై । వంబుసాక్షి॥

రోష___అక్కటకటా? ఇట్టికర్కశఘోరప్రతినఁగావించి నాజీవితముఁ దుదముట్టఁజేసెదవా? ఈనాసౌందర్యమునీజన్మహక్కు-ఈనూత్నయౌవనము నీపూర్వజన్మార్జితహక్కుభుక్తము-ఈహృదయకమలము నీమహారాజ్యలక్ష్మి. వేయేల? నాభూతపంచకము నీకాఙవపారిణము. ఈ భరతఖండమెల్లనేకఛత్రాధిపత్యముగనీచేపరిపాలింపఁజేయఁదలఁచిదక్షిణహస్తమైయవతరించి వరింపవచ్చిన వీరకాంతాశిరోమణి. ప్రియుఁడా! పరమతస్థురాలనని శంకించుచున్నావేమో? మతాచారపద్ధతులు మనుజనిర్మితములు. హృదయాకాశము ప్రకృతిమిళితము. ఒకదానికొకటి సంబంధములేదు. కన్యనగునన్ను దుస్తరవిరహాబ్ధిముంచి జన్మాంతరదుఃఖముఁ గల్పింపకుము. మనోవాక్కాయకర్మముల నీవే నాప్రాణపతివి. నాదైవము. నాజీవనము, నాప్రాణము, సర్వార్థములు నీవే ! నీవే నాదిక్కు, నీకుమించినవస్తువీజగంబునలేదు. నాథా ? మనోనాథా! తాపము, అనురాగము, చిత్తవికారము, మోహము, అబ్బా. భరింపఁజాల భరింపఁజాల. నీహృదయపంజరమున బంధింపుము. రమ్ము. రమ్ము.

శివా___(వెనుకకుతగ్గి) రోషనారా ! మీయున్మాదము మితిమీరిపోవుచున్నది. సహింపఁజాల. నేనిదేపోవుచున్నాను.

రోష___ఆ ! పోయెదవా ? నన్నుఁగూడ గొంపోయెదవా ? అయ్యో! మాటాడవేమి?

శివా—మాటాడ కేమి? ఇదే నాకడసారివాక్యము. మీరు నా మాతృసమానులు. ఇందులకు జగదాధారుఁడగు భగవానుఁడే సాక్షిభూతము. ముమ్మాటికి సత్యము.

రోష—హా? హతోస్మి! (మూర్ఛిల్లును.)

శివా—ఈకాంతామణి మూర్ఛిల్లినది. నేనిటనుండ రాదు. నేను లోనికేగి, యీపెను శైత్యోపచారములొనర్చుటకు పరిచారికను పంపించెదగాక. (లోనికేగును.)

రోష-(మూర్ఛనుండిలేచి) ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! అయ్యో! పలుకవేమి? (దిక్కులుచూచి) ఇంతలోనెటుబోయితివి? అకటా! ఎచ్చటనున్నావు? ఎందుడాగితివి? (పరికించి) ఏడీ! నాజీవితేశ్వరుఁడేడీ? నా మానసచోరుఁడేడీ? (అనుచు వనములోని కేగును.)



## రెండవరంగము.

### ప్రదేశము—ఉద్యానవనము.

రామో—(పొదచాటునుండి యీవలకువచ్చి) హోయిహోయి! రోషనార యిటువచ్చుచున్నది. ఇట్టికన్యామణియేగదా శృంగారరసాధిదేవత. అయ్యారె! కనులకుమిఱుమిట్లుగొల్పు విచిత్రమైన వేసమును వేసమునకుఁదగిన వాలుఁజూపులపరిసారమును- పరిసారమున కనువగు వివిధదేశభాషలును- వేషభాషంక్రిందుసేయు జగన్మోహనాకారము గల యీరమణీమణిని వర్ణించనెవరితరము? ఆహా! ఆమందయానానందవార్నిధి వీచికలపైఁ దాండవమాడిన పురుషుఁడు రంభాసంభోగమునైన నిచ్ఛగింపఁడుగదా! ఓహోహో!

ఉ. అన్నులమిన్న లేతచిగు ♦ రాంబరవన్నెపయిన్ బసిండికాం
తిన్నెసగెంచు చిత్రగతి ♦ తీగెలఁదీర్చినమేల్ జరీపనిన్

వన్నెలమించు కంచుకము । భావములో నడయాడుచన్నులం
దున్నెరయించు హారముల । నూత్నవికాసముఁగొల్చునద్దిరే.

సీ॥ చెలివాలుఁజూపులు । చెలువంపుగోటులు
తొలిబాల్య యౌవన । దుడుకుఁజూప
పునుగు తావులగాలి । పొలతికాయమునేలి
లలిపుష్పవనమెల్లఁ । దొలకరింప
కాదమతుమ్మెదబోలు । కుటిలకుంతలడాలు
కటిసీమనొకవింత । కాంతినింప
పిల్లగాడ్పులకూగు । మేలిపయ్యెదడాగు
స్తనములు లేత జ । వ్వనముఁ దెలుప

గీ॥ రాగరంజితయౌవన । లక్ష్మిహోలె
మెల్లమెల్లనపూఁదోట । నెల్లఁదిరిగి
తాపభరమున నడుగులు । తడబడంగ
నలపుటూర్పులతోనిదె । నరుగుదెంచె॥

(పరీక్షించి) ఆమెయిటువచ్చుచున్నది. నేనీ నికుంజముచాటున కొంచెముసేపుడాగి యుండెదగాక. (అటులొనర్చును.)

(రోషనార ప్రవేశము.)

రోష—ఈయుద్యానవనమంతయు వెదకివేసారితిని. శివాజీ కానరాడయ్యె. నేనేమిసేయుదు?

గీ॥ కట్టెదుటనుండి మాయమై । కానరావు
రమణిఁగనరావ? మోమహా । రాష్ట్రసింహ!

రామో—(ముందుకువచ్చి)

గీ॥ మాయలకు పుట్టినిల్లగు । వానిమీఁద
వలపుఁగలిగిన నీకేమి । ఫలితమబల?.

రోష—ఓయీ! నీవెవ్వఁడవు?

రామో—నేనెవ్వఁడనో తరువాత కనుఁగొనవచ్చును. కానిఁ మాయకాఁడగు శివాజీనివరించిన నీసౌఖ్యమడవిఁగాచిన వెన్నెలగును. దాననీకావంతయేని లాభములేదు.

రోష—ఓరీ! మదోన్మత్తప్రలాపీ! సుద్దులుగరపుటకు నిన్నేమైన బొట్టుఁగాటుకఁబెట్టి పిలిచియుంటినా! ఆవలపొమ్ము.

రామో—మధురవాణీ! నీప్రవర్తన నాకు దెలియదని తలంపకుము. శయ్యామందిరమున శివాజీతో నీవేమేమి ప్రసంగించితివో, యంతయు నేనాచాటునుండి వినియుంటినిసుమా! అదియటుంచి నాసంగతిఁజెప్పెదవినుము. నేను మహారాష్ట్రుఁడను. శివాజీసేనానాయకుఁడను. నాపేరు రామోజీ. ఇప్పటికైనఁ దెలిసినదా? కావున.

గీ॥ వనిత! నినుఁగన్న దాదిగ । మమత హెచ్చె
నించువిలుకాఁడుపట్టిబా । ధించుచుండె
ప్రియముడిగినయట్టి శి । వాజియేల ?
గలియుమా నన్ను నీ కోరి । కలు రహింప॥

రోష—అరేదురాత్మా! మనుజాధమా? కన్నులుగానరాకున్నవా? లేక మద్యమును ద్రావివచ్చితివా?

రామో—చెలీ! నీవు నిజమేవచించితివి. ఏమందువా?

ఉ. భామిని! నీవిలాసమను । మద్యముఁగ్రోలి మదించియుంటి నీ
వేమరుపాటునున్నపుడు; । హేళనగాదు; నిజంబుసుమ్ము నీ
కామముదీర్చుకొమ్మని వి । కావికనవ్వుచు పూవుటమ్ములన్
కాముఁడు గుప్పుచుండె,బిగి । కౌఁగిలొసంగుచుఁదాపమార్పవే?

రోష—ఛీ! ఛీ! వదరుఁబోతా! మత్తెక్కినమాటలాడకుము. బ్రతుకుపై నాసగలదేని బుద్ధిదెచ్చుకొనిమనియుండుము. శివాజీమహారాజు విన్నచో నీకాయువు సంపూర్ణమగును.

రామో.—ఓసీమోసకారీ! నాకుబుద్ధిఁజెప్పుటకు శివాజీయెవ్వఁడు? నీవెవ్వతెవు?

గీ॥ నీతిబాహ్యుఁడు; చోరుఁడు । ఘాతకుండు
మందలింపఁగ నన్ను శి । వాజియెవఁడు
నీమగండటె? మగఁ డను । నేను కాన?

(అనిమీఁది కేగును.)

రోష.—గీ॥ ఎగిరిపడకుము (బాకుదీసి) మగవాఁడ । వేనిరమ్ము?

రామో.— (నిర్విణ్ణుఁడగును)

రోష—పురుషరూపముననున్న యాఁడుదానా! కన్నులుపగిలి రిక్కాయలవలె వెల్లబెట్టి వెఱ్ఱిచూపులఁజూచెద వేల? నన్ను జారాంగనయని తలంచితివా? రమ్ము. ఈబాకుతో నీకంఠనాళములఁజీల్చి వీరకాంతనని పించుకొనెదఁగాక.

శివాజి—(ప్రవేశించి) ఔరా! ఇదేమి? ఈదురాత్ముఁడిక్కడికేట్లువచ్చెను?

రామో (స్వగతము) నేఁటితో నా కాయువు నిండినది.

రోష—ఏమున్నది (బాకు నొఱలోనిమిడ్చి) రాజేంద్రా! నీకొఱకు నేనీయుద్యానవనమున వెదకుచుండఁగ, వీఁడు మదోన్మత్తుఁడై నన్ను జెఱబట్టనెంచెను. మానసంరక్షణార్థమై బాకు జేఁబూనితిని.

శివా—అరేదురాత్మా! పాపీ! నరరూపరాక్షసా! ఢిల్లీచక్రవర్తిసోదరియగు నీమె మాతృసమానయనియైన యోజింపక; కామాంధుండవై, రాక్షసవృత్తిని బలాత్కరింపసాహసించితివిగా ? ఓరీ కృతఘ్నుఁడా? అవిశ్వాసపాత్రా? మహారాష్ట్రకులకళంక! నాబంటువై, నేఁ జేసిన మేళ్ళుదలంపక, నారక్షణమందున్న నారీశిరోమణిని, నాయింటనే, నాకుఁగంతలుగట్టి, చెఱబట్టయత్నించితివా? సొమ్మొఁదిని ఓమ్ము

గుద్ధుటకా నాసేవఁజేయుచుంటివి? రాజద్రోహీ ! పాపసంభవా! కులమునకు కళంకమాపాదించిన నిన్నిదేచంద్రహాసమునకు బలియిచ్చి కళంకరహితము జేసెదఁగాక? జయ్ భవానీ! (కత్తితో నరకఁబోవును.)

రోష—(అడ్డువచ్చి) రాజేంద్రా! ఆగుమాగుము; ఆడుదానికంటె నధముఁడగువీనినిఁజంపుటకు మీభవానీ ఖడ్గముకావలయునా? చంపఁదలంచిన మీరుగావలయునా? ఆకోరిక నాకున్నచో వీఁడింతకుముందె నంతకుపురంబునఁబాత్రకాప్రైయుండెడివాఁడు. కావుననాప్రార్థన మాలించి నీనిని సజీవునిగ విడిచిపెట్టుఁడు;

శివా—దేవీ! శాంతించితిని (కత్తినొఱలోబెట్టి) దుర్మార్గుఁడా! వీరిమూలమున బ్రతికిపోతివి; కాని, యీగడియ మొదలు మూఁడు దినములవఱకు నీకుగడువిచ్చితిని. ఈమధ్యకాలములో మహారాష్ట్రదేశమునువిడిచి పరదేశమునకు పోవలయును. అటులొనర్పక మరుదినము నీవీరపురంబున నుంటివేని శిరఃఖండన మాచరించుట నిజము? ఇది నాయాజ్ఞ. ఇంకనావలకుఁబొమ్ము.

రామో—(నిష్క్రమించును.)

శివా—కాంతామణీ! భవదీయ ధైర్యసాహసౌదార్య గుణంబుల కెంతయుఁ గృతజ్ఞుఁడను.

రోష—అటులైన నన్నిఁకనేలుకోరాదా?

శివా—మఱల మొదటికే వచ్చితిరా? నేఁ జేసినప్రతినయైన జ్ఞప్తిలేదా?

రోష—అక్క...! మనోనాథా! నీవెంతయు పెడదారినిబోవుచున్నావు. నన్నుఁజేపట్టిన నెంతటిలాభమో గ్రహింపకున్నావు. నా సోదరుఁడు పేరునకు పాదుషాగాని, రాజకీయతంత్రములన్నియు నా హస్తగతమైయున్నవి. నాయాజ్ఞలేక నాతఁడెట్టివిషయములందైనను

పాల్గొనఁడు. నామాటవినుము. నాసోదరునితోఁబాటు మొగల్‌సామ్రాజ్యమంతయు ముక్కాలుమూఁడుగడియలలో నీస్వాధీనపరచెదను. దూరమాలోచించుకొనుము.

శివా—దేవీ! ఆలోచనయేల? ఆఁడువారిమూలమున రాజ్యములపహరించుగతి మహారాష్ట్రులకింకనుబట్టలేదు. ఆదినములు వచ్చినప్పుడు విచారించుకొనవలెను.

రోష—మనోహరా! మరియొకమారు నిన్నర్థింపుచున్నాను. ఇదెనాకడసారి ప్రార్థన.

సీ॥ శ్రమలేకనే మొగల్ । సామ్రాజ్యమెల్లను
మాటలోనర్పింతు । మంత్రినయ్యు
పగఁబూని, దక్షిణా । పథమెల్లనోడించి
పట్టంబుఁగట్టెద । బంటునయ్యు
భారతదేశీయ । ప్రభువులగెల్చి, నీ
సామంతులం జేతు । జాణనయ్యు
మోహాబ్ధిలోనిన్ను । ముంచిముప్ప్రొద్దులు
గారవించెద ప్రాణ । కాంతనయ్యు
గీ॥ వేడుకలరంగఁ గ్రీడింతు । వేశ్యనయ్యు
మంగళముఁగోరుచుందు న । ర్థాంగినయ్యు
హా! మనోనాథ! నాపయి । నలుకమాని
కరుణనన్నేలుమా నమ । స్కారమిదిగో॥

శివా—(వెనుకకు తగ్గి తనలో) అక్కటా! నేనేమిసేయుదును? ఈకాంత పరమతస్థురాలుగాని, పరకాంతగాదు. అందుకన్య. కన్యలకు వరాన్వేషణమున స్వాతంత్ర్యముగలదు. ఆకారణమున నఖండరాజ్యసర్వస్వమును తృణీకరించి, యకళంకమగు నవ్యాజానురాగమున

నన్నుఁ గోరియున్నది. మొగల్ సామ్రాజ్యలక్ష్మిని నాకరగ్రహణము సేయింపనున్నది. నన్ను తనహృదయస్థానమలంకరించుకొని యాసేతు హిమాచలపర్యంత భూభాగమునెల్ల నేకచ్ఛత్రముగ నేలింపనుద్యుక్తురాలై యున్నది. వేయేల? నిరాఘాటముగ, నిర్భయముగ, మహారాష్ట్ర స్వరాజ్యధ్వజమను బీజమునాటి, మొలకెత్తించి, దుర్భేద్యమగు మహావృక్షముఁ గావింపవచ్చును. అంతనామనోరథమీడేరి నాజన్మకు శాంతికలుగఁగలదు. ఓహో! హృదయమా! చలింపకుము? మందమతివిగాకుము? వివేకమా! వెడలిపోకుము? ఆశాపిశాచమా! దూరముగానుండుము. లోభమా! నాట్యమాడకుము? ధర్మమా! నీవు నానాల్కపైఁదాండవమాడుచుండుము?ఒక్కయాకుదానిమూలమునతూత్రి ధర్మమునుగంటజేసి, యన్యాయార్జితమునకు నత్తులుజాచుకొంటె, మహారాష్ట్రలకొండునైచ్యమున్నదా? ఛీ! ఛీ! భరతఖండమెగాదు. ఖండఖండాంతరములెల్ల లభింపనున్నను, నేనాయధర్మపథంబును ద్రొక్కఁజాల. ఈకాంతాసందర్శనమే నాకువలదు. ముమ్మాటికివలదు. నాజీవితకాలములో స్వరాజ్యముసాధించితినా? ధన్యుండనె. సాధింపకఁజచ్చితినా? కోటానకోట్లు భారతీయులు లేరా? శ్రీకృష్ణదేవరాయపృథ్వీరాజరాజసింహాది దేశోద్ధారకులగు వీరసింహులగన్న భరతమాత, నాతో నంతరించునా? అపరాధము- భరతమాతా! అపరాధిని క్షమింపుము. (ప్రకాశముగ) ఓయున్మాదినీ! మోహినీ! నీనూపులచే నన్నింకనాకర్షింపకుము? నానిర్మలమానసోదయమునకు కాళరాత్రివై యడ్డురాకుము? నీవు నాతల్లివి? నీమోహదృష్టిని విడిచి వెడలిపొమ్ము. నీవిట నుండుట కర్హురాలవుకావు? తొలఁగిపొమ్ము? ముమ్మాటికిఁ బొమ్ము? ఇది నాయాజ్ఞ. నేనిదేపోవుచున్నాను. జైభవానీ! పాహిమాం పాహిమాం.

రోష—(కోపముతో శివాజీ ముందునిలిచి) ఛీ? ఛీ?ఏమంటివి?

పొమ్మంటివా? ఎన్ని విధముల బోధించిన ననుగ్రహింపక పోవనుంటి వా? ఈషణ్మాత్రమైన కనికరములేకపోయెను. త్రిజగన్మోహనాకారిణిని, అవ్యాజానురాగమానసిని యిట్టినన్ను దృణప్రాయముగనెంచితి వా? నాకోరికలన్నియు భగ్నమొనర్చితివా? నీనిరాదరణమను అంపముచే నాహృదయగోళమును కోసితివా? నాజీవితముపై నాకేయయిష్టము జేయించెదవా? మోసకారుడా? నిన్నేమనగలను? ఛీ! ఇంక నీనితో భాషింపనేల? ఓశృంగారదేవతా! నాయంగస్వాష్టవ మపహరింపుము. సౌఖ్యమా! నీఋణానుబంధము నేటితో దెగిపోయినది. ఓయనురాగమా! నాహృదయస్థానమునుండి వెడలిపొమ్ము. ఓద్వేషమా! ఓక్రోధమా! మీరిరువురు నాకిరుపార్శ్వముల వర్తింపుచు తృణకాలమేని నన్నెడబాయకుండుడు. ఓరాజా! నామోహానురాగము నిదే విడనాడితిని. రాగరహితవచింపు పలుకొకింతవినుము. తొలుదొల్త నీపయినెంత ప్రేమానురాగము ప్రకటించితినో? యిప్పుడంతదారుణద్వేషాగ్నికీలలు ప్రజ్వలింపఁజేసితిని. ఇంతకుఁబూర్వము జగన్మోహనమై, మహానందదాయకమై, ప్రేమపాత్రమై, కనుపించిన నీమనోహర వీరసుందరాకారము, నాకిప్పుడు పిశాచరూపమునఁ గన్పించుచున్నది. ఓరాజా! అస్మద్భయంకరద్వేషాగ్నికీవు గుఱివై సందులక జీవన్మృతుఁడవై యుండుము. నేనాఁడుదానను, కాన, భయమేమని గర్వించెదవేమో? అట్లెన్నటికిని దలంపకుము. ఏమార్గమున మొగల్ సామ్రాజ్యమునెల్ల నీకర్పింపఁదలంచితినో? ఆమార్గము ననుసరించి,నిన్నును, నీరాజ్యమును, నీకుటుంబమును, వేయేల? మహారాష్ట్రరాజ్యసర్వస్వమును నాశనము గావించి, నాద్వేషమును, నాక్రోధమును, నాపరాభవాగ్నిని, జల్లార్చుకొనెదగాక! అల్లా సాక్షిగ నిదే నా ఘోరప్రతిజ్ఞ. నేనిఁకఁ బోవుచున్నాను జాగ్రతగా నుండుము.

శివా—అమ్మా! ఇంతతొందరేల? నాభటులచే పల్లకి సిద్ధము చేయించెద. ఒక్కఘడియకాల మాగుడు.

రోష—ఘడియకాదుగదా! అరనిమిషమైన నీస్థానంబున నిలువఁజాలను. నాహృదయగోళమునుండి వెలువడుచున్న క్రోధాగ్ని నిలువరింపఁజాల. నీముఖముఁజూడఁ జాల. నేనిదే మోఅజీమునొద్ద కేగుచున్నాను. జై. అల్లాదీన్. (నిష్క్రమించును.)

శివా—(ఆశ్చర్యస్తబ్ధుఁడగును.)

(తెరజారును.)





# రోషనార.



తృతీయాంకము.



ప్రదేశము—అరణ్యము.

(రోషనార ప్రవేశము.

రోష—

సీ॥ వడగాడుపులు సుడి ♦ వారి, రాల్చుచునగ్ని
కణములు జగమెల్లఁ ♦ గాల్చుచుండె
మృగ పక్షి జాతులు ♦ బెగడొంది దప్పిచే
నురగలు గ్రక్కుచు ♦ నోళ్లు తెఱచె
జీవకోటులు భ్రాంతి ♦ చేఁబర్వు లెత్తఁగ
నలుదిశ లెండమా ♦ వులురహించె
భయద కంటకశిలా ♦ మయమైన యాభూమి
గడువెచ్చనావిరి ♦ గ్రక్కుచుండెఁ
గీ॥ బ్రకృతియంతయు వేదనా ♦ రవముఁదోచె
నచ్చటచ్చటవనులఁ గా ♦ ర్చిచ్చువెడలె
పాంథజనులకు మృత్యువై ♦ పరగుచుండె
నకట! యీయెండదాడికె ♦ ట్లాగగలనొ?.

అబ్బా! ఆయాసమధికమగుచున్నది. నేనింక నిలువఁజాల. కొంచెము నేపావటవృక్షముక్రిందఁగూర్చుండి విశ్రాంతి దీర్చుకొనెదఁగాక.

(కూరుచుండి) ఈమహారణ్యము నిర్జనమై—నిరాధారమై కన్పట్టుచున్నది. శివాజీమీఁద క్రోధముచే సర్వపరికరశూన్యనై చనుదెంచితిని. ఇప్పటికే నాధైర్యోత్సాహములు సన్నగిల్లినవి. ఇంక రెండుదినములకుగాని యూరంగాబాదు చేరఁజాలను. అక్కటా! నాయీయవస్థకు శివాజీయేకదా కారణము.

మ. త్రిజగన్మోహనమై, జగద్వినుతమై ♦ దేదీప్యమై, నిత్యమై
యజరుద్రాదులకేన్ భ్రమాజనితమై ♦ యస్మద్వయోరూపసీ
రజవైరానన దివ్యవిగ్రహము బల్ ♦ రాణింపగాఁజూచియున్
కుజనుండైనిరసించి, శాశ్వతమహా ♦ కూపంబునం ద్రోసెఁగా!.

అక్కటా! నాప్రాణాపహారుని—నాయౌవన ప్రాణుని—నాప్రభువరేణ్యుని — నాజీవితేశ్వరుని—యీబొందిలో జీవమున్నంతవఱకు—మఱచుటకల్ల. మఱతుమన్నను—మారశరాగ్ని మరింత వేదనాభరముకలిగించుచున్నది. ఆ! ఏమీ! ఇంకను వేదనాభరమా? ఛీ! ఛీ! నేనెంత పొరబడుచుంటిని? నాసుకుమారశరీరపరిహర్తను!--నాహృదయకుఠారమును—నాప్రేమానురాగ లతానికుంజనాశన కారుని—యింకను సద్భావమునఁ దలంచుచుంటినా? ఓమహారాష్ట్రుఁడా! నిన్ను సకలరాజ్య భోగభాగ్యదుంకువిడిచి, నేను నిరాశయను మృత్యుకరాళ గహ్వరమునఁ జిక్కి, చచ్చెదననుకొంటివా? నేనిప్పుడు భయంకర నిర్జనారణ్యప్రదేశమునఁ దపించుచుండ, నీవునీభార్యల కరములం దనుపమానభోగము లొందుచుంటివి కాఁబోలు? నిష్కారణము లఁ దూర్పారఁగాఁబట్టుచున్న యీయుగ్రపుటెండచే నాపెదవు లెండిపోవుచుండ—శతహంసతూలికా తల్పంబున నీవు నీభార్యల మధురాధరామృత పానంబున నొడలుమఱచి యున్నావుకాఁబోలు! నేనిచ్చట జీవన్మృతనై కన్నుల నశ్రుజలంబు రాల్చుచుండ—నీవు నీప్రియామ

ణుల భోగానందమువే నానందాశ్రువుల రాల్చుచున్నావు కాబోలు? అబ్బా! దుస్సహము. దుర్భరము. భరింపఁజాల. భరింపఁజాల!(అంత దెరలో చప్పుడాలించి)అక్కటా! నేనేమి సేయుదును? దొంగలు కాఁబోలు ని టేవచ్చుచున్నారు. అయ్యో! నాకిప్పుడెద్ది శరణ్యము?

(రజాక్ దావూదులు ప్రవేశము)

రజా—రే? భాయీ! దేఖో. దేఖో. హౌడదీ లాగా హుయిరే?

దావూ—అచ్ఛా! అచ్ఛా! తుంబోలింది సచ్ రే.

రజా—దావూద్! హుషార్ కరో. జల్దీ ఆవ్?

దావూ—అచ్ఛా! ఆవో.

రజా—(సమీపించి( మాల్ దొంగల్కి కాదు. మాలుంహై?

దావూ—మాకీసుల్తాన్ హై?(తనలో) హరే! తోబా. హిందీ షూస్తే పేరీలాగహుంది. మాకీసూసిందితో హాల్గా అంతా గరంగరంహై, రజాక్కి మోహంసేసి దీన్కి మై నికా కట్నావ్లి

రజా—(తనలో) వారేవా! దీన్కి షూస్తే సెందుడూలాగ హుంది. దీన్కినగల్ అమ్కు నై. దావూద్కి సెప్పకుండా దీన్కినికా సేస్తాం.

రోష—(తనలో) వీరి నెఖరిఁజూడఁగ సురాపానమత్తచిత్తులై యున్నారు. సమయమున కిదియొక మేలేయగును. (ప్రకాశముగ) అయ్యలారా! మీరలు సుల్తానులేయగుట నేనెంతయు సంతసించుచున్నాను.

దావూ—రే? రజాక్! దిన్కినగల్ అమ్కుమూర్ నై రే!

రజా—నీకేనై తో అమ్కు క్యా?

దావూ—రే! భాయీ! దీన్కిషూస్తే నాకీత ల్గీలాగహుందిరే,

రజా—(తనలో) దీన్కిషూస్తే హీడ్కి తల్లీలాగ బుద్ధిహాయిందీఅంట. మాకీ అద్దుష్టం అచ్ఛాహై. (రహస్యముగ) భాయీ! హీదీ నీకీతల్లీహైతో జల్దీఛోడో. నాకీనిక్కా షేస్కావాలీహని బుద్ధిహాయింది.

దావూ—నైనై, నీకీహబుద్దేషం నాకీహై,

రజా—క్యారే! బద్మాష్! తల్లీహనిసెప్పినావ్ కాదూబే?

దావూ—కోన్కు తల్లి బే? పిల్లల్కితల్లి. మాలుం?

రజా—జూటక్ బోల్తే క్యారే?

రోష—(తనలో) వీరిరహస్యాలోచన మిగుల ననుమానముగానున్నది. వీండ్రు ధనాపహారణులైన గుసగుసలతోఁ బ్రయోజనమేమి? నిక్కముగ నాసౌందర్యాలోకమున బుద్ధిమారి నన్నుఁ జెఱఁబట్ట ప్రయత్నించుచున్నట్లున్నది. ఈకరవాలధారులముందు నాగుప్తఖడ్గమెందులకు బనికివచ్చును? కానిమ్ము; వీండ్రయభిప్రాయమునుబట్టి కర్తవ్యము విచారించుకొనెదఁగాక.

దావూ—రే! రజాక్! నీకీనాకీ దీన్కి నిక్కా షేస్కావాలిహం ఓ,ఏకదిమ్మ, మన్కి హెట్లాహౌతుందీబే? ఏఅచ్ఛానై. మన్కి హెవర్కి నిక్కా షేస్తాయ్ దీన్కిహడ్గుదాం. నీకీషమ్మత్ హై?

రజా—అచ్ఛా! హీది నాకీషమ్మత్ దాన్కిహడ్గుదాం. ఆవ్.

దావూ—(రోషనారనుజూచి) ప్యారీ! జరాస్రునో. హీదీషూస్తే భడేజంగల్. నీకీషూస్తేహోడది. మాకీహిద్దర్కినీకీమీదసాలాసాలా ప్రేమల్కిహాయింది, హందూసేత మాకీహిద్దర్లో హెవడూ హందంషుదంహుండాదో హోడ్కి నిక్కా కట్కోవాలి. నైతో నీకీఛోడ్తానై. జల్దీ బోలో.

రజా—ప్యారీ! నాకీసుల్తాన్ అవుతాది. హోలోషఁకిసేసి నా కట్కు కోవాలాహని సెప్తాయ్, జరాదయాలుంచు.

—(స్వగతము)నాయనుమానమిప్పటికి స్థిరమైనది. వీండ్రు మధువును ద్రావి దృఢచిత్తులైయున్నారు. వీరు నా దేశీయులైనచో నేనౌరంగజేబు సోదరినని చెప్పినంతనే భయపడి పారిపోవుదురుగాని దేశీయులు కానిచో యప్రతిష్ఠపాలగుదును. అంతియగాక; రాయగడ ప్రాంతారణ్యములం దిరుగుచుంటినని వీరు నాసోదరున కెఱింగించెనేని మోసమువచ్చును. కావున, నిరంతరాధారమగు గుప్తఖడ్గము నాయొద్దనేయున్నదిగదా! సమయానుకూలముగ ప్రవర్తించెదగాక.

దావూ—ప్యారీ! క్యాబోల్తీ ?

రజా—హోలమ్యాంహెందుక్ ? జరూర్ సె బోలో.

రోష—చెప్పెదనుగాని, మీ రెవ్వరో యెఱుగవచ్చునా?

దావూ—హాఁ! హం గోల్కొండాసుల్తానుహై.

రజా—హిండ్కీసుల్తాన్ మాటఝూటా. నాకీమాత్రింగోల్కొండా దివాన్ హై.

రోష—కాని, మీయిరువురకు నాయందుఁ బ్రేమగలదా?

దావూ—హాఁ! నీకీషూస్తే నాకీ హాల్గో హంతాగరంహోతుంది.

రజా—ప్యారీ! నీకీమోహం మాకీముద్దూపెట్కోవాలహాని వుంది.

రోష—సరే బాగున్నది. కాని, మీయిరువురిలో నేనీరజాకును నిశ్చయించుకొన్నాను.

రజా—ప్యారీ! నాకీసేస్కుంటావ్? నాకీ! అల్లాహోఅక్బర్! హెంతా అద్రుష్టం, అచ్ఛా అచ్ఛా; ఏకీ ముద్దూదేవ్ (మీఁదికేఁగును)

రోష—ఉండుండుము. నేనెంతయు పొరబడితిని. దావూద్! నీముఖము జూడనిమ్ము. ఛేష్. వానికంటె నీవె యందముగానున్నావు. కావున, నిన్నే కోరుచున్నాను.

దావ్రూ——నాకీ!హాయ్ హాయ్ ఆవ్! జల్దీఆవ్! (మీాదికేగును)

రజా——(అడ్డమువచ్చి)జారేబద్మాష్ ! మొట్టామొదట నాకీ సెప్పింది.తూక్యారే? జా ! జావ్!

దావ్రూ——జబర్ దస్తీకర్తాక్యారే! నీకీ సైతాన్ మోహంలాగ హుందీఅని నాకీ రమ్మంది. తూ క్యారే?

రజా——రే!కబడ్ దార్!దాన్కియిసు స్తేనీకీనాకీపెస్తేహంసైతో లడాయ్ హుంది.

రోష——ఓయీా! దావ్రూద్! భయపడినన్నా మూర్ఖునికంటగట్టకుము. నిన్నే నమ్ముకున్నానుసుమీా ! (దావ్రూదు చెంతకేగును)

రజా——హా శేయ్! ఈడ్కిహాజామత్ చేసి, నీకీనిక్కాకట్కోకాపోతే నాకీ నామ్ రజాక్ కాదూఅన్కో.

రోష——దావ్రూద్! వీనిని నాబారినుండి తొలఁగింపుము, మీాదిమీాదికి వచ్చుచున్నాఁడు. అయ్యో! ఇంకను చూచెదవేల?

దావ్రూ——ప్యారీ! డర్ నకో, హిండ్కిపానంతీస్తాదెఖో.

రజా——రే! నాకీపాణంతీస్తావ్? మైతయార్ హైం,ఆవ్ రే సాలా లడాయ్ కావ్ ! (కత్తి దూయును.)

దావ్రూ——రే ! కాఫర్ ! జల్దీఆరే ?

రోష——(స్వగతము)ఇరువురిలోనొకఁడుచచ్చిన రెండవవానికినేనేబుద్ధిచెప్పగలను.

రజా——రే! కాఫర్ ! దెఖో మై మజా!

రజా——హైవాన్ ! మైమజా దేఖో రే! (ఇరువురుఢీకొందురు)

దావ్రూ——ఏ దేఖో మర్ గయా రే తుం (వానిని పొడుచును)

రజా——రే అల్లా రే. అల్లా !(అని పడిపోవును)

రోష——(వెంటనేరజాకు ఖడ్గముగైకొని) అరే! దురాత్మా!

నీవిఁక నెందుబోయెదవు? ఈమాత్రిపుఖడ్గమే నావద్దనున్నచో మీాయిరువురనిదివఱకే హతమార్చియుందును, రమ్ము. నీపీచమడఁచెదను.

రజా—రే! హెంత మోహం హెంత మోహంరే! హైతాన్! ఆవ్! నీక్‌హజామత్ సేస్తాఁ దేఖో (ఇరువురుపొడుచుకొందురు)

రోష—పాపాత్మా! ఇదె చచ్చితివి. (పొడుచును.)

రజా—రే! అల్లా (అనిపడిపోవును)

(యవనిక జారును)

---

రెండవరంగము.

---

ప్రదేశము:—ఔరంగాబాదు పరిసరారణ్యము.

(రామసింహుఁడు ప్రవేశము)

రామ—(దిశలఁబరికించి) అకటకటా!

గీ. గాఢతిమిరాంధకారము । వీడిపోవ
నుర్విసంతట భాస్కరుఁ । డుదయమయ్యె;
భయదమగు పరాధీనత । బాసిపోవ
సదయహిందూస్వరాజ్యత । కుదయమెపుడొ?

(ఉలికిపడి) ఏదియోచప్పుడగుచున్నది, (వెనుదిరిగిచూచి) ఎవ్వఁడో యొక మనుజుఁడిటే వచ్చుచున్నాఁడు.

(రామాజీ ప్రవేశము)

రామో—(తనలో) ఇతఁడొక బాటసారివలెఁ గన్పట్టుచున్నాఁడు. పోయి పలుకరించెదగాక. (ప్రకాశముగ) ఆర్యోత్తమా! మీారెవ్వరో యడుగవచ్చునా?

రామ—నేనొక రాజపుత్రుఁడను. జయపురాధినాథుఁడను రామసింహ నామధేయుఁడను. మోఅజీము సేనానాయకుఁడను. వాని దర్శనార్థమై యూరంగాబాదు కేగుచున్నాను.

రామో—రాజేంద్రా! నేనెంతయు ధన్యుఁడను. మోఅజీమును సందర్శింప నేనుగూడ యూరంగాబాదునకే పోవుచున్నాను.

రామ—తామెవ్వరు? ఎందునిమిత్తము బోవుచున్నారు?

రామో—నేను మహారాష్ట్రుఁడను. శివాజీయొద్ద సేనానాయకునిగానున్న రామోజీయనువాఁడను.

రామ—(స్వగతము) ఏమిది? శివాజీసేనానాయకుఁడై విరోధియగు మోఅజీమును దర్శింపనేగుట కృత్రిమతలంపుగాదుగదా!

రామో—ఆర్యా! మోఅజీము మహారాష్ట్రరాజ్యలక్ష్మియగు రాయగడమును సాధింప ననేకసారులు ముట్టడించి, విఫలమనోరథుఁడయ్యెను. ఇప్పడాదుర్గమును భేదింపసులభమైనమార్గముగలదు. అది నేనెఱుంగుదును. స్వల్పసైన్యముతో మూఁడుఘడియలలో రాయగడము నాక్రమించుకొనవచ్చును. ఇప్పట్లు మోఅజీమునకు సాయముఁ జేయ నేను-దేవా! అట్లునివ్వెరపాటుజెందెదరేమి? స్థిరసంకల్పుఁడనై వచ్చియుంటిని. మీ మొగమటు లెఱ్ఱబారుచున్నదేమి? పిమ్మట, మహారాష్ట్రరాజ్యమునగొంతభాగమునకునన్ను రాజుఁజేయవలెనని చెప్పిప్రార్థింప-

రామ—(కత్తిదూసి) అరే! దురాత్మా! పాపసంభవా! రాజద్రోహీ!

రామో—(తానుగూడ కత్తిదూసి) ఆ! ఏమంటివి?

రామ—ఓరీ! దేశద్రోహీ!

గీ. శుంఠ! మహారాష్ట్రభూపతి ♦ సొమ్ముఁగుడిచి
ద్రొమ్ముఁగుద్రిద్దగ, రాయగ ♦ డమ్ము నాశ

నంబొనర్పఁగ మ్లేచ్ఛభూ । నాథుకడకు
నరుగుచుంటివ? నీపాగర । ణాతునిపుడె.

హిందూమతోద్ధారణావతారపురుషుండగు శ్రీశివాజీమహారాజు నంత మొందించి, రాజ్యభాగము నపహరింపనుంటివా? మహారాష్ట్రకుల కళంకా! నీయభిమతము నిప్పుడే నెఱవేర్చెద తొందరపడకుము.

సీ॥ భూరికంటకశిలా । వృతమహారణ్యమే
మణిమయస్ఫగిత సిం । హాసనముగ
ఇంగితజ్ఞానమే । యెఱుఁగని యీవన్య
భయదమృగావళుల్ । భటులుగాఁగ
మిక్కుటంబగు గుక్క । నక్కలార్భాటముల్
కమనీయతూర్యరా । వములుగాఁగ
నీచావుకై, నిక్క । నిక్క చూచుచునున్న
రాఁబందు గృధ్రముల్ । రక్షకులుగ

గీ॥ శాకినీ ఢాకినీలు నీ । సతులుగాఁగ
నిర్జనపథంబుశయన మం । దిరముఁగాఁగ
కరకుగత్తిని నీతల । నఱికివేసి
దారనుజేసెదనిన్నిదే । నరకమునకు॥

రామో—ఏమి నీవాగడంబరములు? ఓరీ! అసంబద్ధప్రలాపీ! మూర్ఖుఁడా! నీవు నిజమైన రాజసేవకుఁడవని తలంచితిని గాని, రాజద్రోహివని యెఱుంగనైతి. నీరాజునకు మేలుసేయుతలంపుతో వచ్చిన నన్ను, దూలనాడి, పైకి శ్రీరంగనీతులుపన్యసించెడి నీవు రాజద్రోహివే కాదు. జగద్ద్రోహివిసుమా!

రాము—బుద్ధిహీనుఁడా! నన్ను నిందించుచుంటివి గాన చెప్పెద వినుము. నేను మోఅ[illegible]ము సేనానాయకుఁడనయ్యు మొగల్‌రహస్య

ములనెల్ల శివాజీకిఁ దెలుపుచున్న మాటవాస్తవము. కాని,నీవలె నేను స్వలాభాపేక్షచేఁగాదు. నిజముగుమాతృదేశోద్ధారణకై రాజద్రోహ మొనర్చుచున్నాను. జన్మహక్కగు హిందూస్వరాజ్యరథమునకు సారథినై, శివాజీమహారాజును రథికునిఁగావించి, విజయపతాక మెత్తనున్నాను. నీవో?మహారాష్ట్రవంశమునహాలాహలమువోలె జన్మించి, పరమకిరాతుఁడవై, శివాజీమహావృక్షమును కుంకటివేళ్ళతో గూల్పనున్నావుగదరా పాపీ!

రామో—ఓరీ? తులువా! ఏమిరా నీసక్కవిసయములు?

గీ॥ నీకులాంగనలను యవి । నీతులైన
కరకుతురకలకిచ్చి దు । ర్గములనేలు
చును, మొగల్ రాజ్యలక్ష్మినిఁ । జూరఁగొనఁగ
నన్ను గేల్సేయనేల? దు । ర్నయుఁడ! ఖలుఁడ!

రాము—పలుగాకీ!

భారతమాతృగర్భమున । పండలునీవలెజన్మమొంది,దు
ర్వారకతారిఁబూని రణ । రంగమునం దరిమూకఁజీల్చఁగా
వీరములేక, మ్లేచ్ఛపృధి । వీపతులన్ శరణంబుగోరుటన్
ఘోరవిపత్తు హైందవుల । కున్ గురియయ్యెఁదలంప బాలిశా?

రామో—ఓరీ! జడమతీ! పరనిందాపరాయణా! ఇప్పటివఱకు మొగలులసొమ్ము కుత్తుకబంట మెక్కుచు, తడిగుడ్డలతో గొంతులు గోయింపనున్న నీవు, నన్నెల్లిదము సేయుచు, నీవీరత్వముఁబ్రకటించుకొనుచున్నందులకు నాకెంతయు నవ్వగుచున్నది. మఱియునో మూఢా! నీవంటి హైందవాధములు భారతగర్భమునందుద్భవించుటచేతనే, పరస్పరకలహంబులమునింగి, మనలో మనము పోరాడుచున్నకతన, రాజ్యమరాజకమై, ప్రజాకల్లోలమునుజూచి, మొగలులు విజృంభించి హిం

దూస్వరాజ్యలక్ష్మిని జేఁబట్టియున్నారు. నీవంటి కుతంత్రులు, నీతిబాహ్యులు, శౌర్యహీనులు, జన్మించిన కారణముచేతనే హైందవరాజ్యలక్ష్మియస్తమించినది. ఎల్లవిధముల మహమ్మదీయులే సన్మార్గులగుట వారినాశ్రయించి మదభీష్టంబు నెఱవేర్చుకొనెదఁ గాక?

రామ—ఓరీ! కపటనటనాధురీణా! ఇంక నీతో వాగ్వివాదమేల?

గీ॥ పాపమతులగు నీవంటి । ప్రజలఁబట్టి
కుత్తుకలఁ గత్తిరించిన । కత్తియిదుగో!
భరతమాతకు సంతాప । భరముదీర
ఱిటికెలోనిన్ను భూమిపా । ల్జేతురమ్మ! ॥

(మీఁదికేగును)

రామో—దురాత్మా! నీపొగరడంచెదరమ్మ?

రామ—మాటలతోనేమి? ఈవ్రేటుతోఁ జచ్చితివి?

(ఇరువురు పోరుచుందురు)

రామ—పాపాత్మా! ఇదె చచ్చితివి. (వాని వక్షమునఁబొడుచును.)

రామో—అబ్బా! (అని పడిపోవును)

రామ—వంచకుఁడా! నీపొగరడఁగినది గదా! హైందవులిఁక హాయిగా, నిర్భయముగ, నిదురింపవచ్చును.

గీ॥ వేతనములకు, నుద్యోగ । బిరుదులకును
రాజ్యకాంక్షకు గర్భశా । త్రవులఁజేరి
దేశమాతకు యిక్కట్లు । తేఁదలంచు
పాపసంభవులకు నిదే । పదవిసుండీ!

(నిష్క్రమించును)

రామో—హా! బాధ-బాధ-కత్తిపోటు-గాయము-బ్రతుకను. దుర్భరము. దుస్సహము. రాజద్రోహీ! నిన్ను- చంపుట-నా పరాభవము- చల్లారు- హా! (మూర్ఛ మునుఁగును)

(పురుషవేషధారిణియగు రోషనార ప్రవేశము)

రోష—ఆ! ఏమిది? ఎక్కడనో మానవుని వేదనాకంఠస్వరము వినవచ్చుచున్నది!

రామో—హా! దుర్భరము. బ్రదుకఁజాలను. దాహము.

రోష—(వెనుదిరిగిచూచి) ఓహో! ఇదేమి (వానినిసమీపించి) అబ్బా! ఈరక్తమేమి? ఏమి యీదారుణహత్య. ఇతఁడెవ్వఁడో కదా? (గుర్తించి) ఔరా! ఏమీ యాశ్చర్యము? నన్ను జెరఁబట్టయత్నించిన రామోజీయీతఁడు.

రామో—అబ్బా! దాహము. దాహము.

రోష—ఇతఁడు నాకపకారియైనను, యీయాపత్సమయమున నాకెంతయో జాలికలుగుచున్నది. సమీపమునఁ గాసారమున్నది. పోయి నీరముఁగొనివచ్చెదఁగాక. (నిష్క్రమించి, మరల వెంటనేయాకు దొన్నెతో నీరముదెచ్చి వానినోటఁబోయును)

రామో—ఉశ్! అబ్బా! గాయము. బాధ రామసింహా, రాజద్రోహీ, (కనులు మూయును)

రోష—(తనలో) ఏమిది? రాజసింహుఁడఁట. రాజద్రోహియఁట. ఆతఁడే వీనినిట్లుగావించియుండును. ఇందేదో రహస్యముండవచ్చును. వీనిమూలమున నామూలాగ్రముగ గ్రహించెదఁగాక. ఇతఁడునన్నెఱింగిన కార్యముచెడును. ఎఱుఁగనట్లు నటించెదఁగాక. (వానిదరిజేరి) రామోజీ! రామోజీ!

రామో.—(కన్నులు తెరచి) ఎవరుమీరు ?

రోష.—పురుష వేషధారిణియగు రోషనారను.

రామో.—ఏమీ! రోషనారవా? పురుష వేషమా ?

రోష.—ఔను. ఆనాఁడు శివాజీ నన్ను దిరస్కరించుటనీవెఱిం గిన విషయమేగదా? ఔరంగజేబుసోదరినగు నన్నావిధంబున నిరసిం చిన, యారాజరూపఘండాలుని పరాభవించి, నాద్వేషాగ్ని నిజల్లార్చు కొనవలెనని, రాజగడమువిడిచివచ్చుచుండ, మార్గమధ్యమున నిర్వు రుకాఘరులను తెగటార్చి, యందొకని దుస్తులధరించివచ్చుచున్నాను.

రామో.—తల్లీ! రోషనార! అపరాధిని, నేను, క్షమింపుము?

రోష.—రామోజీ! భయపడకుము. క్షమించితిని.

రామో.—అమ్మా! శివాజీపై ద్వేషము నీకు గలదా?

రోష.—కలదు. ఆద్వేషాగ్ని యింతలోఁ జల్లారదు.

రామో.—సరే! అబ్బా! బాధ, బాధ, తల్లీ!నీద్వేషము-నా ద్వేషము దీర్చుకొనుటకు రహస్యము- కలదు.

రోష.—రహస్యమా: అదెట్టిది?

రామో.—అది, రాజగడరహస్యము. ఇటురమ్మా. నీచెవిలో జెప్పెద. (రహస్యముజెప్పి) ఆవిధముగ, ఉశ్! అబ్బా! బాధ, రాయ గడము, శివాజీ, లభించును.

రోష.—రామోజీ! అంతయు గ్రహించితిని. ఈరహస్యమార్గ మున,శివాజీయనుకిరాతుఁడు దొరుకఁగలఁడు.వానినాశనమునకు గదా? యెన్నడు రాజగడము ముట్టడించి, సాధింతునాయని, యువ్విళ్ళూరు చున్నాను. రామోజీ! నీవు నాకొనర్చిన యీయుపకారమునకుపరమే శ్వరుఁడు నిన్నుబ్రతుకింపవలెను. బ్రతికి నాకుఁగుడిభుజముగ నుండెద వని తలంచుచున్నాను.

రామో—తల్లీ! నేను బ్రిదుకను. హా! బాధ, బాధ, అంతయుఁ జీకఁటిగానున్నది. కనులుతిరుగుచున్నవి. దేహము వడకుచున్నది. నా భూతపంచకము స్వాధీనము దప్పుచున్నది. బ్రిదుకను, రోషనారా! మరియొకటి, మోఅజీముని నమ్మవలదు. అందు, రామసింహుఁడను వాఁడు రాజద్రోహి. మీరహస్యములను, శివాజీకి చెప్పుచున్నాఁడు. మోసము, హా! బాధ, బాధ, నారా యణ, నా-రా-య ణ (అని కనులు మూయును)

రోష—అక్కటా! ఇతండుగతించుచున్నాఁడు. (నాడిపరీక్షించి) బ్రితుకుట దుర్లభము. అయ్యో! ఇతండు బ్రిదికిన నింకెట్టిరహస్యములఁజెప్పువాఁడోకదా? అదె మరల కదలుచున్నాఁడు.

రామో—(కనులుదెఱచి) అబ్బా! బాధ, బాధ. రోషనా రా! మఱియొకమాట. నేను దేశద్రోహినని రామసింహుఁడు నన్ను వధించెను. హా; రామా! రామా! వానిని నాపేరుజెప్పి నీవు ఘోరముగ వధింపుము. నేను, రామా-రామా! (ప్రాణములవిడుచును)

రోష—అక్కటా! రామోజీ! రామోజీ! ఇంకెక్కడ? ఇతండు స్వర్గారోహణమొనర్చెను. గతించిన యోరామోజీ ! నీతుదికోరిక నిరాఘాటముగ నవశ్యము, నెఱవేర్చెదఁగాక.

(యవనికజారును.)





# రోషనార.

అను

# జహ్వారీబాయి.



## చతుర్థాంకము.



ప్రదేశము—ఔరంగాబాదు రాజశిబిరము.

(మోఅజీము—షరీక్—ప్రవేశము)

మోఅ—రే! షరీక్!

షరీ—జీ! సర్కార్!

మోఅ—బద్మాష్! జల్దీహుక్కాలారే!

షరీ—హాజర్ సర్కార్! (హుక్కా దెచ్చియిచ్చును)

మోఅ—(పీల్చుచు) అరే! అల్లా! మైక్యాకరుం! ఖజానామే యేక్ పైసా బీ నైంహై. దారూనై. ప్యారీనై. షివాజీకిజల్దీ బందీసేయాలా అని పాదుషాహుకుంహై. షివాజసూస్తే బడేలష్కర్ వాలా హున్నాడ్! జరూర్ సే బందీసేస్తే ఢిల్లీరాజ్జం మాకే వస్తాయ్ అనితోస్తాది. మాకీయిప్పు యేమీా సెయ్యాలివుంది?

షరీ—సర్కార్! మీర్ జుమ్లాసాబ్ ఆయె.

మోఅ—వహ్పైతాళ్ వాలా; ఆవ్ కర్ బోల్;

(మీర్ జుమ్లాప్రవేశము)

మీర్—మోఅజీమ్ సర్కార్! సలాం.

మోఅ—అచ్ఛా. ఇదర్ బైఠో.

మీర్—(కూర్చుని) సర్కార్! శివాజీతో లడాయ్ సేయటాన్కి వొలుకుందేతేనై? మారాజ్!

మోఅ—రే! షరీక్! నోరుహోరీపోయింది. తోడా దారూలావో?

షరీ—అచ్ఛాహైసర్కార్! (లోనికేగును)

మీర్—మహారాజ్! దారుపీతే గుండెల్కి మోషం సేస్తాది. పాదుషా హిన్నాయీఅంటే, నీకీమాకీ సిఛ్ఛాహోతాది. మీకీ సలాంచేస్తామ్. దారూయిడ్సిపెట్టండి?

షరీ—(ప్రవేశించి) మారాజ్? దారూ హోగయా. హోక్కీ పీపాకూడానై.

మోఅ—హోక్కీకూడా లేదూ బే! అరేఅల్లా! మైక్యాకరుం? దారూనైతో మాకీ పిచ్చిహోతాది. క్యాకరుం? షరీక్! జల్దీ బాలామణ్కీ తీస్కరా?

షరీ—బాలామణీ కోఠ్ మారాజ్!

మోఅ—బద్మాష్! బాలామణీమాలుంనై? భోగంవాడ్. మాలుం?

షరీ—మాలుం. భోగంలమ్మా హై సర్కార్! జాకరాతుం. (వెళ్ళును)

మీర్—సర్కార్! మాకుమంచి సెప్తాయ్ హినోక్కండి? దారూ హోక్కి, ప్యారీహోక్కి, రాజుల్కి వొలుండాయ్‌తో మోషంకివస్తాది.

షరీ—(ప్రవేశించి) సర్కార్! బోగంవాడ్కి డబ్బుతక్వాచేశారుఅంట. రాతిర్ చల్‌గయాఅంట.

మోాల— క్యారే? జంగ్లీ! బాలామణ్కీచెల్ గయా? అరే తోబా! దారూలేకా, ప్యారీలేకా, మైక్యాకరుం? మీార్ జుమ్లా! దారూకి, ప్యారీకి, పరానేశావ్వూ అనితోస్తుంది. సచ్ బోలో?

మీార్— సర్కార్!, నైనై. హల్లాతోడు నాకీ తెల్వాదు.

మోాల— రే! బాలామణీమై తాన్ హై. పాంచ్ దినోంమె లఛ్చారుపియా హోగయానేసి ఎంతామోాషంనేసింది? అబీక్యాకరుం?

(రామసింగుప్రవేశము)

రామ— మోాలజీంసర్కార్! నమస్కారము.

మోాల— రాంసింగ్! మాకీబుద్ధియిఫ్ఠ అచ్ఛానై. నమస్కారం గిమస్కారం మాలుంనై. (అటునిటు తిరుగుచుండును.)

మీార్— (తనలో) షివాజీకి, రాంసింగ్కా థోడానేస్తంవుందీ అంట. వీడ్కీసూస్తే దుష్మన్‌లాగాతోస్తుంది.

రామ— (స్వగతము) నేఁబన్ని నవ్వ్యూహమునకు నితఁడును సరియైనమార్గములో నేయుండెను. ధనములేకపోవుటచేతను, వేశ్య స్వాధీనమున కేగుటవల్లను, వీనిచిత్తమిప్పుడు స్వస్థతలేకున్నది. శివాజీమహారాజుపంపియున్న పారితోషికమునకు వీఁడవశ్యము వశీకృతుఁడగును. సాధనమునకిదియే మంచిసమయము. (ప్రకాశముగ) యువరాజా! నేఁడు మీాచిత్తమేలకో కలతచారియున్నది? మీావిషాదము నాకెంతయు సంతాపముగానున్నది. కారణమడుగవచ్చునా?

మీార్— (తనలో) వీడ్కీ హాలోషరకేసూస్తే, మోాషంకినేస్తాడూహాని తలుస్తుంది. మైక్యాకరుం?

మోాల— రామసింగ్! అం క్యా బోల్‌నా? దారూహోగయా, ప్యారీచల్ గయా, క్యాకరుం బోలో?

రామ— యువరాజా! మీారు ధర్మప్రభులగుటచేత, దైవము

నిన్ను కనికరించి, శివాజీచే యుత్తరమొకటి వ్రాయించి—నాచేతఁ బంపించినాఁడు. ఇదుగో—చిత్తగింపుఁడు (ఉత్తరమొసఁగును.)

మోఅ—ఏక్యా? ఏక్యా? షివాజీ మాకీ హుత్తరం రాశాడ్? బద్మాష్‌కు తాఖీద్ షింపీహేయండి! అమ్కు జరూర్ నై.

మీర్—సర్కార్! షివాజీబడేమోషం హద్మీ, మస్కీహూద్దు. రాంసింగ్ దుష్మన్ లాగాహుండాయ్.

రామ—నీచా! కారులాడిన నిన్నిదే మత్కరాసిని ఖండించి వేసెదఁ జూడుము? (కత్తిఁదూయును)

మీర్—(కత్తిదూసి) క్యారే? దుష్మన్! నీకీమాటల్‌కిహుంతామోషం. నీకీ సమ్మకంసేస్తే పానాల్కితీస్తావ్. ఆవ్‌రే, ఆవ్. నీకీ ముక్కల్కిసేస్తేనే మాకీపేరూవుంది. జల్దీఆవ్!

మోఅ—(అడ్డముగానుండి) మీర్‌జుమ్లా! తుమ్మీహక్కల్‌నై ఛుప్‌రో! రామసింగ్! తాకీదీకి పదువ్.

రామ—చిత్తము.

రాయఁబడము.

వైశాఖ శుద్ధ పంచమీగురువారము.
శ్రీశ్రీ యువరాజుసుల్తాన్ మోఅజీము
గారి దివ్యపాదారవిందములకు మహారాష్ట్ర
రాజ్యస్థాపక శివాజీ వ్రాయువిన్నపములు-

యువరాజా!

ఇంతకు ముందనేకపర్యాయములు మీరును మేమును ఘోరాఘోరిగఁ బోరాడుకొనియున్నాము. ఉభయులకు జయము నిష్ప్రయోజనమేగాక కరిహయభటాది వర్గమెంతయో నాశనమైనది. మరల నీతండ్రియగు నౌరంగజేబు ప్రేరేపణమున—మరల మీపైకిఁ గత్తి

గట్టియున్నావని విని యున్నాను. మనకింక యుద్ధ మనవసరము. ఏమని న;మీరాజ్యాదులపై నాకెంతమాత్రము నిచ్ఛలేదు. నాదేశమే నాకు చాలును. ఒక్కహిందూదేశమె మనకు స్వరాజ్యమగుటచేత నుభయులము భరతపుత్రులమైతిమి. ఏకదేశీయులకు పరస్పరవైరానలము సమంజసముకాదు. మీరును మేమును యేకీభవించిన భరతఖండమే గాదు సర్వభూవలయము నోడింపవచ్చును. నేటినుండి హిందూమునల్మానులైకమత్యము చంద్రార్కముగ వర్ధిల్లునటుల భగవంతుని వేడుకొందము. అన్నివిధముల మీసఖ్యమే నాకు పరమోత్కృష్టమని— యీయుత్తరమే ప్రమాణములుగా తెలియఁజేయుచు గొన్ని బహుమతులు పంపియుంటిని. యుద్ధసన్నాహము లింకఁగట్టిపెట్టి మిత్రత్వమును ప్రకటించగలందులకు సహస్రవందనము లర్పించుచు నింతటితో విరమించుచున్నాను.

ఇట్లు
శ్రేయోభిలాషి,
"శివాజీ"

దేవా! ఇవియే లేఖయందలి సంగతులు. నజరానాలెవ్వియనఁగ నొకలక్షరూప్యములును మిక్కిలి యందగత్తెలగు యిరువురు వేశ్యలును రెండుపెట్టెల సారాయపుబుడ్లును పంపించెను. వాటినన్నిఁటిని తమ గుడారమునందు భద్రపరచితిని. తమచిత్తము.

మోఅ—(సంతోషముతో) అరే! హల్లా! ఎంతగొప్పనజరానా? ఒక్టలచ్చరుపియా—దోబోగంవాలా—రెండూపెట్టిల్కిదారూ! వాహ్వా! వాహ్వా! మాకీసలీబ్ అఛ్ఛాహై. రామసింగ్! శివాజీ బోత్ అచ్ఛా ఆద్మీలాగుతోస్తుంది.

మీర్—మహారాజ్! శివాజీ బోత్ బద్మాష్హై. మీకీ నమ్మానవద్దు. హోష్కిపట్టి పేహంచేశాతో—ఢిల్లీక్లొల్లాగొట్టి-మస్కీ

మస్నా చేస్తాడ్. రామసింగ్ దుష్మన్ హై. నాదీమాట అబద్ధంకి సేయా వొద్దు.

మోఅ—బద్మాష్! ఛుప్‌రహూ! రామసింగ్!తుంఅచ్చాహై. షరీక్! శివాజీ పంపినాదారూ, దోబుడ్డీ లావ్?

షరీ—అఛ్చా మారాజ్ (లోనికేగును)

రామ—(స్వగతము) ఈబహుమతులు వ్యయపడువఱకు మాస ముదినములైనపట్టును. ఈనెలదినములు వీఁడుప్రపంచమే యెఱుంగక సురాపానమత్తకుఁడోము, వేశ్యాసంభోగమువలన పరవశుఁడై యుండు ను. ఈలోపున సింహగడమునేగాదు, దక్షిణరాజ్యమంతయు ననా యాసముగ శివాజీరాజు సాధింపఁగలఁడు. ఇదియే నాకు ముఖ్యావస రము. (ప్రకాశముగ) దేవా! నాకింక సెలవొసంగెదరా?

మోఅ—అచ్చా. తుంజావ్.

(రామసింగు నిష్క్రమించును)

మోఅ—రే! మీర్‌జుమ్లా! చార్‌దఫా మై బోల్తాహుం. జావ్,

మీర్—(తనలో) అరే? హల్లా! మైక్యాకరుం? హిద్దాదాగీ వుండి తమాషాల్కిహం తా చూస్తామ్.

(నిష్క్రమించును)

మోఅ—! బద్మాష్! షరీక్! జల్దీ ఆరే!

షరీ—ఆతుం సర్కార్. (అనుచు సారాబుడ్లతో ప్రవే శము)

మోఅ—(త్రాగి) వారెవా!వారెవా!సూరత్ కాసారా హెంతా మజాగావుంది. షరీక్! బోగంవాడ్కిలావో.

షరీ—అఛ్చాహై సర్కార్. (లోనికేగును)

మోల—దారూ హోగయాకతో మాకీ బుద్ధీహాంతాపాదూ అయింది. అదృష్టం మాదీమంచిదిహావటంసేత—బదేనజరానా ఆగయా! బుద్ధియిప్పగరంగరం ఆయావుంది. (మరలదాగివి) వారెవా! బలే దారూహై. అప్తేతలాతిగ్గ తాహుంది. (ముందుకుచూచి) హోయి! హోయి! దోప్యారీ ఆతాహై. (మరలదాగును)

(షరీకు—దిల్‌కుష్—హుషారీ—ప్రవేశము)

షరీ—మారాజ్! భోగంహమ్మల్ ఆయె. (వేశ్యలనుజూచి) హింల్కిసూస్తే నాకీ పానం గుటూ్క గుటూ్క హంగావుంది. క్యాకరుం?

మోల—రే! బద్మాష్! హోల్కిసూసి హేట్టిూ హన్కుంటు న్నావ్ బే! జాజారె! సాలె! (అని తన్నును)

షరీ—మైజాతుంజీ! (అనిపారిపోవును)

హుషా—దిల్—సర్కార్! సలాం.

మోల—బోత్ అచ్ఛాహై, మీాకీ నాంక్యా?

హు—నాపేరు హుషారీ.

దిల్—నాపేరు దిల్‌కుష్.

మోల—అచ్ఛాహై ప్యారీకీ! మీాకీసాలాదూరంనుంచీవచ్చాయ్. జరాగిదారోతాగి, భోజనంసేస్తే, మీాకీనాకీ మజాహౌంటాయ్.

హు—దేవా! మాకు సురాపాన మలవాటులేదు. క్షమించవలెను.

మోల—నైతో మీాకీదోకబీ నాచ్ కరో?

దిల్—
హు— } చిత్తము, (ఇరువురు నాట్యమాడుచుందురు)

మోఅ—హోయి, హోయి,(మరలదొ్రగి తూలిపడిపోవుచు) దిల్‌ఖుష్! నీకీ నాకీజోడు హై. మజాహై, వారెవా!వారెవా!(అని పడిపోవును)

(పురుషవేషముతో రోషనార ప్రక్కగాఁబ్రవేశించి)

రోష—నేను రోషనారనని చెప్పినతోడనే, శిబిరద్వారరక్షకుఁడగు మీర్‌జుమ్లా గౌరవించి! యిచ్చటిరహస్యములన్నియు నాకెఱిఁగించెను. వీనిసహాయమున, రామసింగు మోఅజీములను బంధించి సర్వసేనానాయకత్వమును నేనేవహించి, రాజగడమును ముట్టడించి, శివాజీనోడించి, నాపరాభవము దీర్చుకొనెదఁగాక, (వేశ్యలనుజూచి నిర్విణ్ణయగును.)

హు— } (నృత్యమాపి వెల్లబోయిచూచెదరు)
దిల్— }

రోష—అక్కటా! ఇదేమి వైపరీత్యము? రాజశిబిరమంతయు భోగపుతొత్తుల నాట్యములతోను,సారాయిబుడ్లతోను, యువరాజు మత్తిల్లియుండుటేమి? ఔరా! ప్రతాపగజకేసరియగు యౌరంగజేబు జ్యేష్ఠపుత్రునకా యిట్టిదశ? ఢిల్లీసింహాసనార్హునకా ? దురాగతము! ఓభోగపుతొత్తులారా! ఆమదోన్మత్తుఁడు, యానీతిబాహ్యుఁడు,మహారాష్ట్రకులపాంసనుఁడు, ఆశివాజీప్రేరేపణమున, వచ్చినది మీరే కదా? నిజము వచింపుఁడు? అసత్యమాడిన మీకంఠనాళములఁ జీల్చివైచెద.

దిల్-హు—(భయము )చిత్తము చిత్తము.

రోష—తొత్తులారా! రహస్యముల నేనెఱుంగనా? మోఅజీమును మోహపాశబద్ధునిఁ . వించి,యింగితజ్ఞానము లేకుండజేయుటకై గదా వచ్చియున్నారు. మీపని బట్టించెద నుండుఁడు. మీర్‌జుమ్లా!

(మీర్ జుమ్లా సేవకులతోఁబ్రవేశము.)

మీర్—అమ్మా! హుకుం ?

రోష—మీర్ జుమ్లా ! ఈభోగపుత్రులను గొంపోయి నీశిబిరమున బంధింపుము?

మీర్—అచ్ఛాహై. ఆవ్. (వేశ్యలు,మీర్ జుమ్లా, భటులు నిష్క్రమము)

రోష—మోఅజీము సురాపానముచే మైమఱచి పడియున్నాడు. వీనికి స్మృతిరాకమునుపే నేను వ్రాయించెడిఫర్మానాపై చేవ్రాలు చేయించుకొనెదఁగాక.

(మీర్ జుమ్లా ప్రవేశము)

మీర్—అమ్మా! హుకుం?

రోష—ఓయీ! అమ్మాయని నన్ను పిలుచుట యెవరైనవిన్నచో కార్యభంగమగును. నన్నింక శూరసింహాయని పిలువుము.

మీర్—అచ్ఛాహై. హుకుం దేవో మహారాజ్!

రోష—మంచిది. కలమును కాగితమును గొనితెమ్ము.

మీర్—(బల్లమీఁద నున్నవాటిని గొనితెచ్చి), (మహారాజ్! ఇంకా సెప్పండి ?

రోష—ప్రదేశము, వారము వ్రాయుము.

మీర్—అచ్ఛా. (వ్రాసి) ఆపై నాసెప్పండీ సర్కార్!

రోష—(నెమ్మదిగ) మొగల్ సామ్రాజ్య కొలువునందున్న సర్వసైన్య సైన్యాధిపతులకు, నారంగిజేబుపాదుషా జ్యేష్ఠపుత్రుఁడగు మోఅజీముసుల్తాన్, యీఫర్మానామూలమున నాజ్ఞాపించునదేమనగా!-నాదేహము రుగ్మతచే ప్రాణాపాయకరముగ నుండుటచే,రణరంగమును స్వయముగ నడిపించుటకు వీలులేక, నా ప్రాణసమాను

డగు వీరసింహుఁడను రాజపుత్రుని నియమించి, నాసర్వాధికారముల నీతనికిచ్చి, రాజగడము ముట్టడించునటుల నేర్పాటుచేసి యుంటిని. కావున వీనియాజ్ఞలకు మీరెల్లరు బద్ధులై కార్యక్రమము నడిపించె దరుగాక.

మీర్——(వ్రాసి) తర్వాత సెప్పండి ! సర్కార్ !

రోష——ఇఁకఁ జెప్పవలసిన దేదియులేదు. కాన,వీనికిమత్తువీడ కమునుపే దానిపై సంతకము జేయించుము?

మీర్——సిత్తంసర్కార్ ! (మోలజీముదరిజేసి) సర్కార్ ! జరాఉఠోజీ!

మోల——(కనులు తెరచిమూయుచు) క్యాబే ! హుషారీ! హూట్ ముద్దూ దేవో.

మీర్——మూరాజ్ ! హోడదీన్నై. ముందూ హిస్తాసంతక్ సెయ్యండి?

రోష——సంతకమేలయని ప్రశ్నించిన, సంతకములేనిదేసారా యివ్వరని చెప్పుము.

మీర్——సిత్తం. సర్కార్ ! సంతక్ కరోజీ?

మోల——సంతక్ కైకూంబే?

మీర్——సంతక్ లేకాపోతే దారూన్నై. హిస్తాసెయ్యండి!

మోల——ప్యారీ! అచ్ఛాహై. మూకీచెయ్యిహిస్తామ్. నీకీసంతక్ సేయించుకో. (అటులొనర్చును)

మీర్——(సంతకముజేయించి) అచ్ఛా! దారూలేతే. సోజావ్ జీ! మూరాజ్! సంతక్ సేయించామ్. ఫర్మానాహిద్దోండి!

రోష——(పుచ్చుకొని) మంచిది. ఓరీ! ఎవఁడురా అక్కడ ?

భటుఁడు——(ప్రవేశించి) దేవా! ఆజ్ఞ.

రోష—సేవకా! నీవుతత్క్షణమేగి రామసింహుని గలిసికొని మోఅజీముసర్కార్ మిమ్ముల నతిత్వరితముగ రమ్మనెననిచెప్పి తోడ్కొనిరమ్ము?

భటు—చిత్తము. (నిష్క్రమించును)

రోష—మీర్ జుమ్లా! ఒకరహస్యము. రామసింహుఁడు రాజదర్శనార్థమై వచ్చుచుండుటచే, సర్వపరికరశూన్యుఁడై వచ్చును. కావున నీవిప్పుడు పోయి, వేశ్యలున్నగుడారమునందే బంధించి, దృఢకాయులగు నలుగురు మొగల్ సేవకులను వెంటనిడికొనివచ్చి, యీగృహద్వారమునకు జాటుగా నిలిచియుండవలయు. పిమ్మట నేనారాజసింహునితోఁ బ్రసంగింపుచు, "శివాజీకిజే"యనియెప్పుడఱచెదనోయప్పుడుహఠాత్తుగ మీరువచ్చి, వానిపయింబడి బంధించి కారాగృహముఁ జేర్పవలయును. తెలిసినదా ?

మీర్—హాఁ! అర్థంహోయిందీ సర్కార్!

రోష—వీనినింక నీడ్చుకొనిపోయి భటులతో సత్వరము రావలెను.

మీర్—సిత్తం. (వానిని మోసికొనిపోవును)

రోష—(తెరవంక జూచి) అడుగో! నాటకరంగస్థలమునకు రామసింహుఁడు వచ్చుచున్నాఁడు. రానిమ్ము?

రామ—(ప్రవేశించి) రాజపుత్రా! నీవెవ్వరవు? నీవిక్కడకు వచ్చినకారణమేమి? మోఅజీమెందున్నవాఁడు?

రోష—రామసింహమహాశయా! మోఅజీము పనుపున నేనే మిమ్ముఁ బిలువనంపితిని.

రామ—నీవెవ్వరవు?

రోష—నేను శివాజీపనుపునవచ్చిన రాజపుత్రుఁడను. వాని యాజ్ఞానుసారముగ మోఅజీమును శృంఖలాబద్ధునిగావించి మొగల్

సేనలను మదాజ్ఞకు లోబఱచుకొని, శివాజీప్రభువునకు జయముఁబ్రి సాదించితిని.

రామ—ఆహా! ఎంతయు పరమాద్భుతము గదా?

రోష—వీరాగ్రేసరా! రాజగడమునందు నేఁటికై దవదినము నగొప్పసభ జరుగును. ఆనాఁటికి మిమ్ములను దోడ్కొనిరమ్మనిశివాజీ ప్రభువు నాకాజ్ఞనొసంగెను. తాము దయచేయవలెను.

రామ—అట్లేవచ్చెదను.

రోష—బహుసంతోషము. శ్రీశివాజీకి జై. (వెంటనే మీర్ జుమ్లా భటులతోవచ్చి రామసింహుని పై దుముకును)

రామ—(క్రోధాశ్చర్యములతో)ఓరోరివంచకులారా! నిలుఁడు నిలుఁడు. (అనుచుమీర్ జుమ్లా చేతనున్న ఖడ్గమునులాగికొని) ఓదుర్మా ర్గులారా! రండు. రండు. మీకాయువునిండినది.

రోష—మీర్ జుమ్లా! సేనలారా! రాజద్రోహిని పట్టుఁడు-కొ ట్టుఁడు, నేనిదేపోయి మరికొందఱిని పంపెంచెద (లోనికేగును)

రామ—(స్వగతము) నేనిట జాగుజేసిన ప్రాణాపాయమగును. వీండ్రను హతమార్చి పారిపోయెదగాక.

మీర్—క్యారె సిద్దిబిలాల్ ! హసనల్లీఖాన్ ! జానూఖాన్ ! హుషార్ కరో. వీడ్కి గోలీకట్టాలి. మారో—మారో,(వానిమీద క లియఁబడి యుద్ధముసేయుచుందురు.)

రామ—(అందఱనుగాయపఱిచి) జై ! శివాజీమహారాజ్ కిజై. జై! భవానీ! (అని నిష్క్రమించును)

రోష—(ప్రవేశించి)మీర్ జుమ్లా! ఆరాజద్రోహుఁడేడి?

మీర్—(ఆయాసముతో) సర్కార్! మాఁ యేక్ దంమార్కె దవుడ్ గయా మారాజ్ !

రోష—ఏమీ! పారిపోయెనా? అరరే! చేజిక్కినపక్షి యెగిరిపోయెఁగదా! (యోచించి) కానిమ్ము. ఇంతమాత్రమునకుఁ జింతిల్లిన ప్రయోజనమేమి? మీరు జుమ్లూ! సకలసేనాసమేతముగ నేఁటిసాయంతనమే సింహగడమునకుఁ బోవలయును. నీవునాయాజ్ఞగావచించి, సేనలసంసిద్ధమొనర్పుము. రామసింహుని విషయమై నేను విచారించెద. పొమ్ము. (అందఱునిష్క్రమింతురు.)

(యవనికజారును.)





# రోషనార.



పంచమాంకము.



## ప్రథమరంగము.

ప్రదేశము—శివాజీదర్బారు.

(శివాజీ, నేతాజీ, మోరోపంత్, త్ర్యింబకరావు, గంగాధరుఁడు, మొదలగు వారు ప్రవేశము)

శివా—అమాత్యవరులారా! సేనాధిపతులారా!సభ్యులారా! సింహగడమును సాధింపనేగియున్న వీరకేసరియగు తానాజీ మాలశురే, భుజబలపరాక్రమాతిశయమున దుర్గమును సాధించెనని యింతకుముందే శుభవార్తవచ్చినది.

అందఱు—జయ్! శివాజీమహారాజుకుజై!

శివా—సింహగడము మనహస్తగతమగుటచే మొగలులవలన మనరాజగడమున కెట్టిభయోత్పాతము గలుగఁబోదు.

గంగా—రాజేంద్రా! మీమాటసత్యమె. కాని, మనము యుద్ధసన్నద్ధులమై యుండుట మేలని నాయభిప్రాయము.

త్ర్యింబ—మహారాజా! గంగాధరుఁడు వచించినట్లు మనము యుద్ధమునకు సంసిద్ధులమైయుండుట శ్రేయోదాయకము.

నేతా—దేవా! సింహగడము సాధించితిమని మోఅజీ మొజెంగి ససైన్యముతో వచ్చిన కీడు వాటిల్లును. ఇపుడు మనయొద్ద నైదువేలసైనికులుమాత్రమె కలరు. కావున త్వరపడవలయును.

మోరో—వీరాగ్రేసరులారా! ఇందులకొక కారణము లేక పోలేదుసుమా! మోఅజీముకొలువునందున్న రజపుత్రరాజసింహుఁడు, మనకు బాసటయై మోఅజీము నీపాటికి బంధించియుండును. కావున, వానివలన మనకు భయములేదు.

("హా! మోసము—మోసము—ప్రమాదము" అనుచు రామసింహుఁడు ప్రవేశించును)

శివా—రామసింహమహాశయా! ఈకలవర మేమి? ఈరూప మేమి?

రామ—రాజేంద్రా! విఘ్నము, మోసము, ప్రమాదము.

మోరో—ఏమి మోసము? ఏమివిఘ్నము?

రామ—ఏమనిచెప్పుదును? ఎవఁడో రాజపుత్రుఁడు, వీరసింహ నామకుఁడఁట. మోఅజీముని శృంఖలాబద్ధునిఁగావించి, కృత్రిమమున నన్నుఁగూడ బంధింపసిద్ధపడఁగ, వారికాయములు గాయపఱచి పలాయనమైతిని. ఆయువకుఁడు మహమ్మదీయ సర్వసైన్యముల కధినాథుఁడై యుద్ధమునకు వచ్చుచున్నాఁడు. ఈపాటికి సింహగడముఁ బ్రవేశించెదరు.

మోరో—హా! ఎంతకష్టము?

శివా—అమాత్యా! అధైర్యమువలన లాభములేదు. ఆర్యా! మొగల్ సేవాపరిమితి మీరెఱుంగుదురా?

రామ—దేవా! ముప్పదివేలకాల్బలము. పదివేలగుఱ్ఱములు అఱువదియేనుగులు. ముప్పదిఫిరంగులు.

అందఱు—హా! భయంకరము. ప్రమాదము.

శివా—అక్కటా? వైరులింతవేగముతో వచ్చునని కలనైనఁ దలంచి యెఱుంగనుగదా?

రామ—మహారాజా! నాఁడు నేనొనర్చిన శపథము నెఱవేర్చుకొనఁజాలనందుకు మిక్కిలి విచారపడుచున్నాను. కాని, అందుకు ప్రతిఫలముగ నొకటిసాయము జేసెదను. ఏమనిన, నాప్రాణమిత్రుఁడగు జయసింహుఁడను మహమ్మదీయ సేనానాయకునిక్రిందఁ బదివేల రాజపుత్రసైన్యముగలదు. నేనిదేపోయి యాసైన్యమంతయు మనపక్షమునకు గొనితెచ్చెదను.

మోరో—ఎంతయు ధన్యులముగదా ?

శివా—రామసింహమహాశయా ! మీయుదారగుణమున కెంతయుఁ గృతజ్ఞుఁడను. సభికులారా! తానొకటిఁదలఁప దైవమొండుతలంచుననుట నిజమయ్యెను. మనస్వల్పసైన్యముతో నెదిరించినను బాధములేదు. కావున, నేతాజీమహాశయా !

నేతా— దేవా! ప్రసాదము.

శివా—మీరీతక్షణము నూర్వురుమావళేభటుల సాహాయ్యమున సింహగడమునకేగి, తానాజీకి మహమ్మదీయుల రాక నెఱిఁగించి నామాటలుగా నిట్లు వచింపుఁడు?

గీ॥ మొగలుసేనాసముద్రము । ప్పొంగి, మనల
ముంపవచ్చెను, యెట్టి క । ష్టమ్ములైన ;
పంతమునుబట్టి జీవ ము । న్నంతవఱకు
సంహరింపుచుఁ, గాపాడు । సింహగడము॥

నేతా—దేవా! మహాప్రసాదము. సెలవొసంగెదరా ?

శివా—మంచిది పోయిరమ్మ.

నేతా—చిత్తము. (నిష్క్రమించును.)

శివా—సభాసదులారా! రెండువేలసైనికులతో మనరాజగడ సంరక్షణార్థమై, గంగాధరుని సేనాధిపతిని గావించుట; మిగిలిన రెండు

వేలభటులతో, నేనీరాత్రియే పూనాపట్టణమునకరిగి, కావలసినసైన్యములపోగుచేసి, సమయమునుగనిపెట్టి, మార్గమధ్యమున మహామ్మదీయులతో ఢీకొందును. అంతదనుక మీరు గడుజాగరూకతతో రాజగడమును రక్షించుకొనెదరుగాక ?

రామ — రాజేంద్రా! నేను జయసింహుని గలిసికొనవలయును. ఆజ్ఞనొసంగెదరా ?

శివా — బహుసంతోషము. సుఖముగఁ బోయిరమ్ము.

రామ — చిత్తము. (నిష్క్రమించును.)

శివా — సభ్యులారా? మీమీపనులయందప్రమత్తతమెలంగుదురుగాక. ఇంకఁ గొలువుచాలింతము.

అందఱు — జై ! శివాజీమహారాజ్కీజై !

(యవనిక జారును)

---

ద్వి తీ య రం గ ము.



ప్రదేశము-సింహగడప్రాంతమున యుద్ధభూమి.

(విక్రమసింహుఁడు-జయసింహుఁడు ప్రవేశము)

జయ — విక్రమసింహా ! శివాజీరాజు సమయానుకూలముగ పూనానగర ప్రాంతారణ్యముల నాలుగునాళ్లనుండి నడయాడుచు, నిన్నసాయంతనమే పరిమితిలేని సేనాసమూహముల సమకూర్చుకొని యీప్రదేశమునకరుదెంచి, మనతో ఢీకొనయున్నాఁడు.

విక్రమ — జయసింహా ! అటులయిన మనకీసింహగడరాజ్యము లభించుట మిక్కిలి కష్టమునుమా ?

జయ—జయాపజయములు విధినిర్ణీతములగుట మనమెట్లు చెప్పగలము? (తెరవంకజూచి) అబ్బా! యుద్ధరంగమెంత భయానకముగా నున్నదో చూచుము?

మ॥ ప్రళయోద్భూతమహాగ్నిగోళములతో । బ్రహ్మాండశబ్దాళితో
విడుగాకారములై, శతఘ్నులవే యు । ర్వీభాగముల్ బూదిగా
సలుపన్ దోచెడు, రక్తఖండములతో । సంగ్రామరంగంబు యు
జ్జ్వలమై తాండవమాడుచుండె, నిరుక । తుల్ధీరతల్ బోరెడిన్॥

విక్రి—సోదరా! నిజము నిజము. ఈమహాసంగ్రామము.

సీ॥ ఘనశతఘ్నీముఖో । ద్గతమైన ధూమంబు
గాఢాంధకారమై । క్రమ్ముకొనఁగ
మరఫిరంగీల ని । ర్భయతమంబగు నాద
ములు, మేఘగర్జన । వలెనురుమఁగ
పేలుచో వెల్గెడి । జ్వాలికల్, విద్యుల్ల
కాంతివంతంబుగా ? గనుమెఱయఁగ
విడబడుచున్నట్టి । విలయాగ్నిగుండులు
మిగులవర్షాపాత । ముగఁగురియఁగ
గీ॥ మృతజనసమూహముల దేహ । తతులనుండి
చూడభీభత్సమైయొప్పు । శోణితంబు
వైతరణివోలె రయమున । పారుచుంట
జిత్రమగు వర్షఋతువనఁ । జెలఁగెనార!॥

జయ—అవును. ఇదియొక మహాభారతయుద్ధమువలె నంతులేకున్నది.

విక్రి—(ఇంకొకవైపుదిలకించి) జయసింహా! అటుచూడుము? ఎవ్వఁడో యోగివేషమున నిటేవచ్చుచున్నాఁడు?

(రామసింహుండు యోగివేషమున బ్రవేశము)

జయ—మహాత్మా! మీ రెవ్వరు? యుద్ధభూమిని సంచరించుట కేం గారణమేమి?

రామ—నేను మీ కాత్మీయుడను.

జయ—ఏమీ! మీరు మా కాత్మీయులా? తమ నామధేయము?

రామ—ఇంతలోనే మఱచితిరా? నేను రామసింహుండను.

(నిజరూపము ధరించును)

జయ—(హఠాత్తుగ వానికరమును బట్టుకొని) రామసింహా! మన స్నేహాభిమాన మటుండనిమ్ము. నీవు రాజద్రోహివై, మొగలుల రహస్యముల నెల్ల శివాజీకి దెలియబఱచిన నిన్నిదే బంధించుచుంటిని.

విక్రి—ఇది మంచిపని.

రామ—(పరిహాససూచకముగ) జయసింహా! నీహాస్యోక్తులకిది యదనుగాదు. "నీకు దేశసేవయం దభిలాషగలద"ని యనేకపర్యాయములు నాతోఁ జెప్పియుంటివి. నీయభిమతమీ డేర్చుకొనుటకుం దగిన కాలము సమీపించినది. ఏమనియెదవు?

జయ—రాజసింహా? నీ ప్రసంగము లిఁక గట్టిపెట్టుము, ఈ క్షణమున నేను జయసింహుండనుగాను. నిజముగ మొగల్ సేనానాయకునిగ మాటాడుచున్నాను. నీవిప్పుడు ఖైదీవైతివి. తెలిసినదా? విక్రమసింహా? రమ్ము. వీనిని గొంపోయి మనవీరసింహప్రభువునకప్పగింతము.

రామ—జయసింహా! ఏమంటివి? నీవాడునవి నిష్కళంకముగు మాటలేనా?

జయ—ముమ్మాటికి.

రామ—భగవంతునిసాక్షిగ?

జయ—భగవంతుని సాక్షిగా.

రామ—(పచేయివిడిపించుకొని) అరే! దురాత్మా! మిత్ర

ద్రోహీ! (అని చివాలునఁ గత్తిఁ దూయును.)

జయ—విక్ర-(కత్తులు దూయుదురు)

రామ—ఓరీ! కల్మషహృదయా! నీవు దేశభక్తుఁడవనినమ్మి, నే నెంతయు మోసపోతిని. కాని,

ఉ. కాలికిఁ బొట్టపోసికొనఁ । గ్రూర తురుష్కుల నాశ్రయించి, కం
సాలి, కసాయిరూపమున । నస్వప్నమున్ ; నిజదేశసేవయం
దాల మొసర్ప శౌర్యమిసు । మంతయెఱుంగని యాసుదాస వీ
వేష? స్వదేశరాజ్యమది, । యేష? ననామక క్షత్రియాధమా !

జయ—ఓరీ! కృతఘ్నా !

గీ॥ దొంగవై చేసఁ జిక్కియు । దొరవిధమున
డాంబికము జూపెదేలర? దంభచరిత!
గర్వపడకుము ఖడ్గముఁ । గలదటంచు
మృత్యుదేవత నిన్ను వ । రించెనేఁడు.

విక్ర—ఓరీ కుటిలాత్మా! మొగలులసొమ్ముఁ గుడిచి అమ్ము గ్రుద్ది స్వామిద్రోహివయ్యు, మాదృక్కలి సద్వంశసంభూతుండును, నిరుపమాన భుజబలపరిరక్షితుండును, ప్రభుసేవాపరాయణుండును, అగు జయసింహునా? దూలనాడుచుంటివి? సద్వంశసంభూతుండగు రాజపుత్రుఁడు, నీవంటి ఘాతుకకృత్యమునకుఁ బాల్గొనఁడుసుమా?

రామ—ఓరోరి నీతిబాహ్యులారా! శూరమ్మన్యులారా! స్వదేశాభిమానశూన్యులై, బానిసవృత్తిని, యవమానకరశ్వవృత్తిని, మానధనపౌరుషాదులర్పించి, బ్రతుకుచున్న, యపౌరుషజీవనులగు మీరు, నాతోఁ బ్రసంగించుటకైనఁ దగరుసుమా? ఛీ! ఛీ! దేశద్రోహులగు మిమ్ముఁ జూడరాదు. నేనిదేపోవుచున్నాను. (పోఁబోవును)

జయ—విక్ర—నిలునిలు, (అడ్డగింతురు)

జయ—పారఁబోతా! ఎందుఁబోయెదవురా ?

గీ వీరరక్తముసీమేనఁ । బారునేని?
యాలమున నిల్చిమమ్ముఁడెగ । గార్చిపొమ్ము!
అబలవేయైన ఖడ్గము । నవలద్రోసి
కరములు మొగిడ్చి మారాజు । కడగరమ్ము.

విక్ర—అంతియేగాదుసుమా?

గీ. నీవొనర్చిన ద్రోహము । నెమ్మిఁదలఁచి
కావుమంచును మాప్రభు । కాళ్లనొఱగి
తప్పిదము నొప్పుకొన్నచో । ముప్పులేదు;
కానిచో, నీకు మృత్యువు । కలదు మూఢ!

రామ—ఓరోరీ దుర్మదాంధులారా! మీప్రభువు నన్ను రక్షించువాఁడా?

ఉ. క్రూరతురుష్క సఖ్యమున । గున్ దలలొగ్గుచు భీతిలేక, దే
శారులఁగూడిపోయి భర । తావనిపైఁబడి కొల్లఁగొట్టి, సం
చారము సేయుమిమ్ము;నతి । సాహసుఁడాయపురంగ జేబునిన్
క్రూరఖరాసిఁగుత్తుకలఁ । గోయుదుగాని క్షమింపమందునే?

విక్ర—సోదరా! కాలయాపనమేల? సంగ్రామమొక వైపున మహాభయంకరముగానున్నది. శత్రుసేనకూడ మఱింత పెచ్చుపెరిగినది. మనమట కేగవలయును. ఈపలుగాకిని మట్టుబెట్టవలయును. త్వరపడుము?

జయ—దురాత్మా! యుద్ధమునకు సంసిద్ధుఁడవా?

రామ—ముమ్మాటికి సంసిద్ధముగానున్నాను.

జయ—విక్రమసింహా! నీవు కడుజాగ్రత. వీనిని వెంటాడుచుందము. పాపాత్మా! ఇంకరమ్ము.

రామ—పలుగాకులారా! రండు, రండు.

(ముగ్గురు పోరొనర్చి హతులగుదురు)

(పురుష వేషముతో రోషనార ప్రవేశము)

రోష — ఓ మొగల్ సైనికులారా? వీరవరేణ్యులారా!

చ॥ భళి! భళి! సేనలార ! నిర ॥ పాయముగా జయలక్ష్మిఁబట్టినా
రలు; కనుచూపు మేరను దు ॥ రంబొనరింపఁగ శత్రుసేనలు
జ్వలగతివచ్చుచుండె; కడ ॥ సారి రణంబిదిగాన, మీబలా
బలములుచూపి,దిగ్విజయ ॥ పత్రికఁజేఁగొనిరంపు శూరతన్.

మొగల్ సేనాపతులారా! మఱియొకమాట. శివాజీ దుర్మార్గుఁడెచ్చ టనుండి సేనాసమూహమును తీసికొని వచ్చుచుండెనో గాని, యిసుక పాతరవలెఁదరగడము లేదు. వాఁడు కొండయెలుక. ఏమూలనేమేమి ఘాతుకకృత్యములకుఁ బాల్పడుచున్నాఁడో యెఱుఁగలేము. ఈవిధముగ మరిరెండు దినములు యుద్ధము జరిగినచో, మనకు పరాభవముకలుగు నేమో యని సందియమగుచున్నది. కావున, రాజగడమునకు గుప్త మార్గమొకటికలదు. నేఁటిరాత్రికి మూఁడు వేలభటులతో నాపర్వత మార్గమునఁబ్రవేశించి, దుర్గము వశపఱచుకొనవలయును. మీరీవిషయమై జాగ్రతగానుండుఁడు. (తెరవంకజూచి) ఓహో! ఏమి యీపోరాటము? షహబాస్! మహమ్మదీయులారా! షహబాస్! అల్లిపోరుచుండుఁడు. నేను గూడవచ్చుచున్నాను, అల్లాదీన్ (అందఱునిష్క్రమింతురు.) (యవనిక జారును)

---

తృతీయరంగము.

---

ప్రదేశము-యుద్ధభూమి.

(శివాజీ-నేతాజీ" మోరోపంత్ ప్రవేశము)

శివా — ఓమహారాష్ట్రవంశ రక్షామణీ! దాక్షాయణీ! భవానీ! అస్మద్వీరసైనికనికాయముల దీవింపుము.

సీ. కన్నబిడ్డలను చం । కలయందు నిడుకొని
యొడలుచు, తుదిముద్దు । లందినారు
ఎలుగెత్తి యేడ్చెడి । యిల్లాండ్ర నోదార్చి
కడుదుఃఖభరమున । విడిచినారు
కడిపెడుదుఃఖముఁ । గల తల్లిదండ్రుల
ప్రవిమలాశీస్సుల । బడసినారు
సానఁబట్టినయట్టి । శస్త్రాస్త్రములఁ దాల్చి
యుగ్రరణభూమిఁ । గురికినారు

గీ. భరతపుత్రులమని పేరుఁ । బడయుకొఱకు
వెన్నుఁజూపక, చెచ్చెర । పిడుగులవలె
పోరుచున్నారు జగదేక । వీరులయ్య;
విజయులగు గాక, యనుచు, దీ । వింపుమమ్మ.

మోరో—మహారాజా! భవానీయనుగ్రహపాత్రులగుటచేత నే, నేడ మోఘముగఁ బోరుచున్నారు. వెండియు భవదీయ వీరవాగమృతధారలచే, పులకాంకురులై, మేనులుమఱచునట్టు ప్రోత్సాహమొసర్చెదగాక.

నేతా—దేవా! మీరాయాసపడవలదు. సమయానుకూలముగ మాత్రము హెచ్చరికఁ జేయుచుండుడు.

శివా—అట్లేయొనర్చెద. ఓ మహారాష్ట్రవీరులారా! హర్ హర్ మహాదేవ్! భవానీదేవి మీకు విజయముఁ బ్రసాదించుగాక; మీప్రభువగు శివాజీ పలుకులాలింపుఁడు.

గీ. శస్త్రములఁ దాల్చి, ఘనస్వరా । జ్యంబుకొఱకు
సమర మొనరించువారిదే । జన్మయగును;
క్షాత్రమును బాసి, పరుల దా । స్యంబుఁ గోరి
సంచరించెడి వారిది । జన్మయగునె?

# రోషనార.

మోరో— దేవా! పశ్చిమదిక్కునఁబోరుచున్న మనసైనికులు నిరుత్సాహులగుటయేగాక, మిక్కిలి యపాయకరమగు స్థితియందున్నట్లు గన్పట్టుచున్నారు. ఇటుదయచేయుఁడు?

శివా— (పశ్చిమదిశకువచ్చి) జౌనౌను. ఓమహారాష్ట్రవీరులారా! హర్ హర్ మహాదేవ్! ఇపుడుమీతోఁబోరాడుచున్న మహాసైన్యములుహిందూదేశస్వాతంత్ర్యము నిరాఘాటముగనిర్మూలమొనర్చినవి. దేవళములనేలమట్టముఁగావించి, పట్టణంబులుకొల్లగొట్టి, పుస్తకభాండాగారముల నగ్నిద్రోసి, స్త్రీలనుచెఱబట్టి, పెక్కుచిక్కులపాలొనర్చినవి. అట్టియీసైన్యపిశాచములఁబట్టి పల్లార్చకయూరకుందురా? మరియొకమాట. ఈసింహగడమునుమఱలశత్రువులు సాధించినచో మనరాజగడమును సులభసాధ్యముగ నాక్రమించెదరు. అటులయినచో మహారాష్ట్రవంశచంద్రుఁడస్తమించును. కావున నోవీరాధివీరులారా! వీరభారత గర్భరత్నములారా! రణశూరులారా!

గీ॥ విధివశంబున జయము ల । భింపకున్న
నదియుదేలను? మనస్వరా । జ్యమెయడంగు;
జయము లభియించెనా? స్వరా । జ్యరథమెక్కి
పాడుకొనెదము దేశీయ । పాటలెన్నొ॥

ఇదియునుఁగాక.

సీ॥ మీతాతతండ్రుల । వీరరక్తముమేన
యెల్లవేళలఁ బ్రవ । హించునేని
పరస్వరాజ్యమును, భా । స్కరతారకంబుగ
నిలుపసుస్థాపింప । నెంతురేని
ఖలబృందముల కరం । బులఁజిక్కనీక, కాం
తలమానములఁ గావఁ । దలఁతురేని

భారతౌన్నత్యము । స్వర్ణాక్షరములతో
నుదయింపఁ జేయుగా । నుంటి రేని

గీ॥ జగమునకు సాక్షిభూతమై । సకలజీవ
హృదయదర్పణబింబమై । యెసఁగుచున్న
భాస్కరుఁడు పశ్చిమాంబుధిఁ । బడకమున్నె
విజయశంఖంబునూదుఁడీ! । వీరులారా !॥

మోరో—ఓవీరవరులారా. హర్ హర్ మహాదేవ్ ! ప్రధానామాత్యుఁడగు మోరోపంత్ వచింపుచున్నాఁడు.

గీ॥ వీరగతిఁబోరి, భారత । వీరులు తమ
రక్తమును ధారవోసె ! గా । ల్వాలవిధంబు,
వీరపురుషునకొక్క టే । మృత్యువగును
పంద పలుసార్లుమృత్యువు । వాతఁబడును॥

ఓ యోధానుయోధులారా! నేఁడవశ్యము జయలక్ష్మి మనకు లభ్యము కాగలదు. కారణమేమంటి రేని? మహారాష్ట్రరాజ్యస్థాపక శ్రీశివాజీ మహారాజు,

సీ॥ శత్రుమండలినోంచి । జయము ప్రసాదించి
పాలించు దేవతా । శ్వంబుతోడ
భారతదుర్భిక్ష ? వారాశినింకింపఁ
గలిగినశాంతము । ఖంబుతోడ
వైరికాంతారదా । వకవహ్ని యోయనఁ
గాన్పించు దీర్ఘ ఖ ? డ్గంబుతోడ
పరిపంథిహృదయ క । వాటముల్ ఛేళ్ళిన
వ్రియ్యలొనర్చు శూ । లంబుతోడ

గీ॥ హరుని మూఁడవనేత్రమో? యనఁగఁబఱఁగు
వీరరక్తముహృద్వీథి । వెల్లివిఱియఁ
బవరమున నిల్చియుండఁ శి । వాజిప్రభువు
జయరమాదేవి నెవ్వఁడు । సంగ్రహించు?॥

(తానాజీ ప్రవేశము)

తానా—మహారాజా! జయముజయము. మొగలుల సర్వసైన్య మంతరించినది. శుభవార్త విన్నవింప సింహగడము నుండి వచ్చితిని.

శివా—బహుసంతోషము. తానాజీమహాశయా! ఇంకను నా కోలహలమేమి?

తానా—మిగిలిన స్వల్పసైన్యముతో వీరసింహుఁడు మాశ్రేము పౌరుషమునఁ బెనఁగులాడుచున్నాఁడు. కాని, వాని కాయమెల్ల గాయములతో నిండియున్నది. పౌరుషముచే రణభూమిని జావనున్నాఁడు.

మోరో—జయ్! శివాజీమహారాజుకు జై!

శివా—ఆహా! భవానీకృపావలోకనమున మనమెల్లరము ధన్యులమైతిమి.

(తెరలో శివాజీసేనల విజయధ్వనులు)

శివా—అల్లదే! విజయోత్సుకులై మన సేనాసమూహములానందకందళితహృదయారవిందులై, జయజయధ్వానము లుగ్గడించుచున్నారు. తక్షణ మా ప్రదేశమునకరిగి వీరభటులకు మనకృతజ్ఞతఁ జూపింపవలయును. కాని, భవానీదేవి నొకమారు ప్రార్థించి మఱిపోవుదముగాక. (ధ్యానము సేయుచుండఁగ తెఱజారును)

## చతుర్థరంగము సమరప్రదేశము.

(మోరోపంత్ ప్రవేశము)

మోరో—(చేయెత్తి) ఓమహారాష్ట్రవీరులారా!

గీ॥ ఖలులటంచు, మహామ్మదీ । యులఁద్యజించి
మనలవరియించెజయలక్ష్మి । మానితముగ ;
రక్తపాత మొనర్పక । రణమునాపి
జయజయధ్వానములనిఁక । సలుపరండు!॥

వెన్నుఁజూపిన పిరికిబంటుల వెన్నాడకుఁడు. శత్రువులకు సర్వనాశనమైనది. దూసిన మీవిచ్చుకత్తులింక నొరయందుబెట్టుఁడు. కథానాయకులులేని నాటకమేల? మీర్ జుమ్లా ప్రాణమందాసచే పారిపోయెను. సర్వసేనానాయకుఁడగు వీరసింహుఁడు, నిజమగు వీరసింహుఁడై తనకాయమెల్ల గాయములతో రుధిరము గారుచుండినను, వెన్నుఁజూపక, వీరశయన మలంకరింప, వీరరణాంగణమున నిలిచియున్నాఁడు. వానివలన మనకేమంతయు హానిలేదు. కావున, మీరెల్లరు రాజగృహమున శ్రీశివాజీమహారాజును దర్శింపఁ బయనముగుండు. (నివ్వెరపాటుతో) ఔరా! యీవచ్చుచున్న వీరుఁడెవ్వఁడోకదా! వీరరక్తసిక్తాంగుఁడై గుఱుతింపఁజాలకున్నాఁడు. నేనీసామీప్యముననే దాగియుండికనుఁగొనెదగాక.

(రక్తసిక్తాంగుఁడగు గోపనారప్రవేశము)

గోప—హా! తుట్టతుదకు నాకెట్టిగతిపట్టినది? అక్కటా!

చ॥ అనిమొనఁజచ్చినారు భటు । లందఱు;నొక్కఁడుగాని లేఁడు; ని
ర్జనపథమయ్యెభూమి ; రణ । రంగము భీతినిగొల్పుచుండె; నా
ల్కనుఁ దడియారె ; దాహమధి । కంబయెఁ ; గాయము రక్తసిక్తమ

య్యెను; కడఁబట్టెజీవము; భ రింపఁగఁజాల నికేదిమార్గమెు?॥ అయ్యో! నేనిపుడేమి సేయుదును?సింహగడమూ చేఁ జిక్కలేదు.శివాజియూ పట్టువడలేదు. నాయాశలు నిరాశలైనవి. నిరాశయే కాదు. సర్వనాశనమైనది. ఇప్పుడు నా కేమిగతి?

సీ॥ రోయుదునా? యింత ద్రోహంబొనర్చిన
పాపసంభవుఁడు, శి వాజియనుచు
వే్రిమింతునా? జగ త్ప్రేమావలోకనఁ
గలదివ్యమంగళా కారుడనుచు
విలపింతునా? కోరి వలచి వచ్చినదాని
చావుగోరినయట్టి పంతుఁడనుచు
శాంతింతునా? వీర సంగరాంగణమున
మృత్యుదేవతయె వ రించెననుచు
గీ॥ జవితము సన్న గిలినను స్థిరతపడక
ప్రేమవిద్వేష మానస వీధిజనిత
ఘోరసంగ్రామ చలితమై కూలియున్న ;
నిర్మలానంద మొందదీ కెర్మమేమెు?.

(అని చతికిలబడును.)

మోరో(తనలో) ఔరా! మహాద్భుతము !, మహాశ్చర్యము !, పురుషవేషధారిణియైవీరవిహారమొనర్చిన,యీనారీశిరోమణియెవ్వరో గదా! ఆలసింపరాదు. ఈవృత్తాంతము శివాజీప్రభువునకు తెలియఁబఱచి, తోడ్కొనివచ్చెదగాక. (నిష్క్రమము.)

రోష—ఉస్—అబ్బా! దాహము!—దాహము!— హా! యిదేమి? శిరోభాగము దడ దడకొట్టుకొనుచున్నదేమి? (తడవిచూచుకొని) అబ్బా ! నాతల రెండుమూడు గాయములచే రక్తము స్రవించి

పోయి బాధించుచున్నది.( శరీరముంజూచుకొని) ఇదిగో! నాదక్షిణభుజమందొక గాయము. హా! ఘోరము! ఘోరము. నాకాయమెల్ల గాయములతో నిండియున్నది. అక్కటా! ఇంకను దేహమునుండివెచ్చనినెత్తురు గారుచున్నది. నాశరీర మాపాదమస్తకము, రక్తమయము. హా! రక్తమయము. అయ్యో! భరింపజాల. నాకాయమంతయు వేడియావిరులు - పొగలతో - మంటలతో - బాధలతో-మూర్ఛిల్లఁజేయుచుండెను. హా! బాధ బాధ! ఈకనులు-అయ్యో! నాకనులు చీఁకట్లు గ్రమ్ముచున్నవేమి ? అబ్బా ! దాహాము-దాహాము ! దుర్భరము-దుస్సహాము- దురవగాహాము- హా! (కొంచెముపరుండి చివాలునలేచి కూర్చుని) ఆ! ఆ! శివాజియా! విడువకుఁడు-బంధింపుఁడు_ పొడువుఁడు-మనకేజయము. నిలువుఁడు. నేను వచ్చుచున్నాను (లేవఁబోయి మూర్ఛిల్లును)

(శివాజి-మోరోపంత్ ప్రవేశము)

శివా—( ఆతురతతో రోషనారనుపరీక్షించి) హా! ఎంత ఘోరము? ఎంతభయానకము? ఈమె రోషనార. హా! పంతాజీ! వ్రణవైద్యునివెంటనే తీసికొనిరండు!

మోరో—మహాప్రసాదము. నిష్క్రమించును)

శివా—(ఆమెనాడిఁ బరీక్షించి)ప్రాణవాయువులు మందగమనమున నున్నవి. శీతలోదకమున దెప్పరిల్లవచ్చును. సమీపమందున్న మడుగులో నీరముఁగొని తెచ్చి యామెను దాగించెదగాక. (అటులొనర్చును)

రోష—(నీరుదాగ్రి కనులుతెరచి వానినిగుర్తించి) ఆ! ఎవరు నీవు? శివాజీవా? శివాజీవా? (లేచిచివాలునగత్తిదూసి)శివాజీ! శివాజీ! నిలువుము. నిలువుము. ఎవనిప్రాణాపహరణమునకై - యేప్రదేశముసంకల్పించితినో? అట్టినీవు- కట్టెదుట—నిట్టనిలచి యున్నావా? ఇప్ప

టికి చేఁజిక్కితివా; నామనోరథ మిప్పుడీడేర్చితివా ! ఇంకనాప్రతిననె అవేరినట్లే. నా ద్వేషాగ్ని చల్లారినట్లే. జయలక్ష్మి నన్ను వరించినట్లే. చీ! సుజనాపకారా ! క్రూర- దుర్మదపథసంచారా! మదీయజీవధనాప చార ! నా ప్రేమానురాగ సంహార! నిలువుము. ఇంకెందుఁబోయెదవు. ఎందు డాగెదవు! ఎవ్వరి నాశ్రయించెదవు! గమ్ము! దురమొనరింపరమ్ము, ఇదె నాకరవాలము. నీకంఠ మర్పింపుము. (కత్తి నెత్తును)

శివా—(చిరునవ్వుతో) ఓజగదేక వీరకాంతా! నాకంఠ మర్పింపసంసిద్ధుఁడనై యున్నాను. ఇచ్చెదను గాని మీకోరికమాత్రము నెఱవేర నందులకు చింతిలుచున్నాను. ఏమంటివేని? భయంకరాహవమున బహువీరశిరః ఖండన మాచరించియున్న మీకఱకు కరవాలము- మిక్కిలి మొక్కవోయి మొద్దువారినది. అందుచే నాయీమొరటుశిరము నఱుకజాలదని వగచుచున్నాను. కావున, నాయీచంద్రహాసమునుగైకొని మీకోరికఁ దీర్చుకొనుఁడు. (కత్తి నొసఁగఁబోవుచు తనలో) ఈనాపలుకులతో నీమోయాగ్న్యనలము చల్లారగలదు.

రోష—(కత్తిఁ బారవైచి విస్మితయై నేలఁగూలి) హా! శివాజీ! శివాజి! నిన్ను నే నెఱుఁగుదును. ఇట్టి నీయమృతోపమానమగు పలుకులకు- నీయపూర్వధైర్యసాహసములకు - నీజగదేక వీరసౌందర్యావలోకనమునకు- నాహృదయము- నాదుర్బలహృదయకమలము - ముకుళించి- నీయందులీనమయ్యెను. అబ్బా! ఏమిది; నామానసకాసారము ప్రళయసదృశకల్లోలమగు చున్న దేమి? ఉంపుంపుము (కనులుమూసి) హా! ఇదేమి? ఏదియో నామానసవీథినుండి చొచ్చుకొని బహిర్గతమగుచున్నది. ఆహా! నాచంచలదృష్టికిప్పుడు నిర్మలమై- నిరాధారమై నిష్కళంకమై నిరుపమానమై నిత్యానందశరచ్చంద్ర చంద్రికాసమన్వితమై- యేదియో యొక మహాజ్యోతి- నేత్రానందదాయకముగఁ గాన్పించుచున్నది. ఆగుమాగుము. (కనులు తెఱచి (శివాజీ! నూంచితి

హా! ఎంతటిచిత్రము? ఇప్పటివఱకు భయంకరమ్ముగఁదన్నుఁగ్రమ్మిన దుర్మోహమేఘపటలిని చివాలున భేదించుకొని- వెలువడి- నాయను రాగకాంతినిస్తుందుఁడగు చంద్రుఁడు- మరలనాయందుఁ జల్లనిలేత వెన్నెల కిరణములఁ బ్రసారింపుచున్నాఁడు. వలపుగలిగించుచున్నాఁడు. వాంఛితమీఁడేర సమయమిదె యని తన కాంతిని మఱింత ప్రజ్వలింపుచున్నాఁడు. హా! మనోహరా! రోషనారాచిత్తచోరా! క్రోధోద్రేకమున నిన్నుఁజంపఁ దలంచిననారీపిశాచిని క్షమింపుము.రక్షింపుము. మన్నింపుము. (మూర్ఛిల్లును)

శివా.—(ఆమెకుసపర్య లొనరింపుచు) అక్కా! నేనేమి సేయుదును? వ్రణచికిత్సఁజేయ వైద్యుఁడింకను రాకుండెను. ఈకాంతకు- యీవీరవిహారసదృశకు- కాలమాసన్నమైనటులఁ దోచుచున్నది. నాకోటలోనికిఁ గొంపోయెదనా? అటులొనర్చిన,గాయములు పగులువాఱి ప్రాణాపాయ మొనర్చునేమో? (విసరుచు) ఆహా! ఈకాంత చెంగట నాహృదయమేలనో? కల్లోలమగుచున్నది. ఈమె యవ్యాజానురాగ మోహానలస్పర్శమున - నగ్ని మ్రోల వెన్నవలె - నామానసముద్రవించుచున్నట్లున్నది. అయ్యయో! జగజ్జ్వాలాయమానుఁడగుసూర్యుఁడు సైతముఁజూడవెఱచు యీజగన్మోహనాకారికి - ధైర్యస్థైర్య వీరవిహారపరాక్రమోపార్జితాఖండ భారతరాజ్య మార్తాండుఁడైన యారంగిజేబు సోదరికి- ఈపురుష వేషధారణము- ఈమహాభయంకరయుద్ధకాండము- ఈరణరంగవిహారము- ఈరక్తపాతక్రీడనము--ఈకంటక శిలావృతారణ్యశయనము- నేఁటికి-నావలనఁగదా! నాయెడల ననురాగమువలనఁగదా- యిట్టియాపద తటస్థించెను. ఓతల్లీ! భవానీ! అంబికా? కాత్యాయనీ! ఈయబలను-ఈరమణీలలామను ఈజగన్మోహినీసదృశను-మహమ్మదీయ వంశార్ణవమునఁ బుట్టించితివేల ? పుట్టించినదానవు, నాయందీమెకిట్టి మోహమొనగూర్చినదానవు.

విచిత్ర పరస్పరముఖావలోకనము సంకల్పించితి వేల? సంకల్పించినదానవు, నన్ను హిందూమత ధర్మపాశబద్ధునిఁగావింపనేల? ఇదంతయువిచారింప,నాహృదయమును శోధించుటకో? నాధైర్యస్థైర్యములఁబరీక్షించుటకో? ఓభవానీ! నన్నివిధముగఁ బరీక్షింపనేల? నాపంచభూతములు భక్ష్యములవలె-నారక్తమునాజ్యమువలె-నాహృదయకమలము విందారగించు పళ్లెరమువలె, నపారమగుభక్తితో, నీకుసమర్పించియుందును. కాని, హిందూదేశధర్మములుమాత్రము నీకొఱకైన నర్పింపఁజాలను. ముమ్మాటికి నర్పింపఁజాలను. తల్లీ! ఇఁకనైన నీవిషమపరీక్షను విడనాడుము. మానుము.

రోష——(కనులు తెఱచి) ఆగుమాగుము. నేను స్వర్గరాజ్యమునకుఁబోయెదను. నీవీవీరరాజ్యమున నుండవచ్చును. ప్రాణేశ్వరా! కొంచెము సేపు తాళుము. త్వరపడకుము.

శివా——వీరనాయికా! నేనిక్కడనేయున్నాను.(విసరుచుండును)

రోష——(నెమ్మదిగ లేచికూర్చుండి) వలదువలదు. నీసుకుమారహస్తపల్లవము లెత్తఁబొరును. మనోహరా! ఇప్పటికైన నన్ననుగ్రహించితివా? ఆగుమాగుము. ప్రత్యుత్తరమనవసరము, వలదు. హా! ఎట్టికర్ణకఠోరమాటఁబల్కితిని? కాని,ప్రియా! ఔననియో, కాదనియో,నాప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చియుందువు. ఓమహారాష్ట్రనాయికా! ఔనంటివా? నిన్నుఁగలియుటకు నాకాయువు సమీపించెనని దుఃఖింపవలసియున్నది. లేదంటివా? వెనుకటికంటె మహాదుఃఖ వారాశిని మునుఁగవలసియున్నది. ఈరెంపప్రశ్నలయం దేదియైనను, నాహృదయశూలమే. కావున నాప్రశ్న నట్లుండనిమ్ము, ఇప్పటికి నీవు నన్నుఁగరుణించితివని సంతసింపుచుంటిని. అసంతసమే నాయంత్యకాలమునకు శాంతిదర్పణమగుచున్నది. ఆసంతసముతో, నీచెంత నన్ను దీర్ఘనిద్ర మునుంగనిమ్ము. అబ్బా! ఇదేమి? భూమితిరుగుచున్నదో, నాకన్నులు

తిరుగుచున్నవో, తెలియకున్నది. ఆ! ఎవరుమీరు! ఏమంటిరి! దేవక న్నియలా? (నవ్వుచు) ఓ దేవతాకన్యలారా! మీరథాగమన మొక క్షణకాలము నిలుపుడు. వచ్చెదను. ప్రాణపతీ! నేనుస్వర్గారోహణ మొన ర్చుచున్నాను. కడపటి నాకోరిక నైనఁ దీర్చెదవా? అది యనురాగవిష యికము కాదు.

శివా—అవశ్య మన్నిటీర్చెదను.

రోష—అటులమాడుము! ఆకుసుమకోమలమైన తీవెలలో నొక దానిని త్రెంపి నాకొసంగుము?

శివా—ఇదెకోసి తెచ్చెద. (తెచ్చియిచ్చును)

రోష—(పుచ్చుకొని) ఓమహారాష్ట్రరాజ్యస్థాపకా! లోకం బున నేకపత్నీవ్రతస్థు లెవ్వరనిన, హిందూమతధర్మపాశబంధితు లెవ్వ రనిన, నిన్నుఁ జేర్కొని పిమ్మట నితరులఁ జెప్పవలెను. రాజ్యముపో నిమ్ము. ప్రాణాపాయము కలుగనిమ్ము. మహారాష్ట్రవంశచంద్రుఁ డస్తమింపనిమ్ము. నీనిశ్చలసత్యశీలములకు మాత్రము కళంక మిఁక ముందైనఁ గలుగఁబోదు. ఇట్టి వీరభారతపుత్రరత్నమునకు నీకుఁగా క, మాతృదేశాభిమానము, స్వాతంత్ర్య పునర్జీవనప్రతిష్ఠ, యెవరికి దక్కఁగలదు? మీభారతదేశీయులలో పాండవుల యనంతర మీదేశ మున, హిందూస్వరాజ్యబీజమును ముందుగా నీవునాటెదవు. శివాజీ ఛత్రపతివయ్యెదవు! బ్రాహ్మణాశీర్వాదములతో, మంగళతూర్యా రావములతో, పవిత్రగంగానదీతోయంబులతో, మహావైభవమున నచిరకాలములో, ఛత్రపతివిగా నభిషిక్తుఁడవయ్యెదవుగాక. కాని, నీవీరవైభవాదులఁగాంచి, యానందించు భాగ్యము నాకు మాత్రము లేదు. పోనిమ్ము. ఇప్పుడే, యిచ్చోటనే, నావీరరక్తముతో, నీలలాట

భాగమున తిలకమును బెట్టి, యీకుసుమశోభితలతాకిరీటముతో, నీశి రము నలంకరించి, నిన్నిదే, శ్రీఛత్రపతి శివాజీనిగాఁ జేసి, నేనా నందవారిధి నోలలాడుచున్నాను. శివాజీ ఛత్రపతీ! మహారాష్ట్రభూపతీ! సలాములు.

శివా.—(నవ్వుకొనుచు ప్రతిసలాములొనర్చును.)

రోష.—ఓ దేవకన్నియలారా! నాపనులు సర్వము ముగిసినవి. ఇదుగో! నేను సిద్ధముగా నున్నాను. రండు. శివాజీ! నన్ను నీవు మరువకుము. స...లా......(మరణించును.)

(యవనిక జారును.)

సర్వము సంపూర్ణము.



# రోషనార

అను

—జహ్వేరిబాయినాటకము.—

—ఇందలికీర్తనలు—

—రోషనార, శివాజీ శయ్యాగారవర్ణన.—

1 అనుబంధము.

—సురటరాగము ఆదితాళము—

ఎంతటిధన్యను - కంతుసమాను శివాజిపటము
నేగాంచగల్గితి॥ నెంత॥ కాంతుడు నను నేకాంతముగను.
గాని కాంతాతుని విరహామునునుపలికిన
కంతుగృహామునను మంతనమాడి ధరంతయు
నీనికి నొసగెద గనువడి॥ నెంత॥

రోషనార. 2 అనుబంధము.

—కన్నడరాగము - ఆదితాళము.—

సోమసుందరశుభాంగవినుమా - వినుమరాటకుల
నాధనినునే - ప్రియముతోడ వరియించితినిగా॥ సోమ॥
స్థిరముగామది - లోగలరాగము - చెలువుగావినరా -
సుకుమారా - కరుణనేలువినుతా - గుణభరితా
రూపజితా - శుభచరితా - నిరతా॥ సోమ॥

శివాజి. 3 అనుబంధము.

భాగేశ్వరీరాగము - రూపకతాళము.

తగదుతగదు ననువరింప - తరలుమింకనోసతీ
పరసతులఁ దల్లులవలె - నరయునన్ను విడిచిచనుమా॥త
కనుగాని నినుప్రేమబెంచు - కన్నవారికపయశమగు
మనమున యభిలాషవీడి - మానినిపురికరుగుమా॥ తగ

శివాజి. 4 అనుబంధము.

బీన్‌పలాస్ రాగము- త్రిశ్రగతి.

ఆనందమయ్యె - ధన్యుఁడనైతినో - మొగల్‌సతీ॥ ఆనం
సుగుణసతీ - సాధుమతీ - వీరసతీ - రోషనార॥ ఆనం॥
నీదర్శనమున - నిఖిలాఘములు - నిర్మూలమై
జన్మతరించెగా - నీకతంబుననునేడూ॥ ఆనం॥

రోషనార. 5 అనుబంధము.

బ్యాగ్ రాగము - ఆదితాళము.

ఓరిమరాత్మా! పాదుషసోదరినని యెఱిగియుక్షా
మించెదవా - నాహితబోధలు - నీశ్రవణంబులకర్క
శమైవిననొల్లవుగా—ఓరి॥—
వెషవెషమాటలతో బనియేమిక విరహముదీర్చెద
గన్గొనరా - పరసతులన్ జెఱబట్టగరాదనిపాపుడ
భూరికృపాణమునన్॥—ఓరి॥—

రోషనార. 6 అనుబంధము.

బ్యాస్-ఆదితాళము.

ఓరీక్రూరుడ - కాపురుషాత్ముడ - దూరాడెదవానన్నిటులన్
మరాటివంశా - భరణుడవగునిక-ఖరాసిపాలొనరింతును రా-

